# అభిప్రాయములు

పరమ రసజ్ఞశేఖరుఁడు పండితమౌళియు రామలింగరె
డ్డి, రచన మెచ్చె నీయది కడిందిగఁ గావ్యపుఁ జిర్పొలాలలో
మిడుతలు మెచ్చియేమి మఱి మెచ్చకయేమి! భవత్కృతి ప్రధన్
బడి సఖుడొందు సౌఖ్యమను భావము పండినదోయి నాయెదన్.

నీ కవనంబు క్రొత్త హవణించిన చిక్కని పైఁడిచేను నీ
చేకొను నూహ భారతము సేగిని దీర్చెడి పైరగాలి నీ
పోకడ చల్లు విత్తనము మొల్కలు తేర్చెడి చల్లవాన యీ
ప్రాకట సౌకుమార్యమునఁ బ్రౌఢిని దెచ్చెద వెట్టి దిట్టవో.

నీదెసఁ జాటు భావములు నెట్టన చిక్కని కావ్యభావముల్
ప్రోదియొనర్చి కూర్పునను బ్రోఢతనంబును జూపు దిట్ట నీ
మై దొరకొన్న యీ ప్రతిభ మంజులమైన పురాణమల్లు మా
మాదిగ మాలలన్న కొఱమాలిన దౌష్ట్యము లంతరింపగా.

బెజవాడ
21—7—1943

విశ్వనాథ సత్యనారాయణ,
ఎం. ఏ.

అరుగ రాచిన కొలఁదిని పరిమళంబు
నెక్కుచుండు శ్రీగంధపుఁ జెక్కకరణిఁ
జదువఁ జదువ నీ కైత రసంబు హెచ్చె!
సరసగుణసాంద్ర! జోసపు సత్కవీంద్ర!

అనఘుఁడు రాయ డాతని ప్రియాంగన బాలకులేవురున్ వచిం
ప నలవిగాని బాధపడుపట్టుల వర్ణనచేయునప్డు నీ
మనసునఁగల్గు మార్దవము మానసమున్ గఱగించె నెంతఁగా
నినుఁ గొనియాడినన్ గొఱయె నీకు సముండవు నీవె మిత్రమా!

కష్టముల గ్రుగ్గి బుగ్గియై గగ్గిదేల
తగ్గి తలయొగ్గి మనసున నగ్గి పడగ
నాపదలమొగ్గు నీదుగ్గి యక్కటకట!
యా యరుంధతికిని మిన్న యనుటయొప్పు.

రసము పరిణతినొందెఁ బాత్రముల యిడుమ
లెదఁగఱంచె, సందర్భముల్ హృద్యములయి
వఱలుచుండె! " నేకోరసః కరుణయేవ "
యనుట నన్వర్థముగఁ జేసితయ్య! నీవు.

మృదులాతి మృదులమగు నీ
యెద! కవితయు నంతకన్న మృదు! వాంధ్రులు నిన్
గొదుకక సన్మానించినఁ
దుదిలేని ముదంబు నొందుదున్ కవిరత్నా!

ప్రొద్దుటూరు
12-6-43

కావ్యకళానిధి, కవిసింహ:
దుర్భాక రాజశేఖర శతావధాని.

# ANDHRA UNIVERSITY

*Vice-Chancellor :*

**Sir C. R. REDDY,**

Kt. Hon. D. Litt., M. L. C.

GUNTUR

*Camp: Chittoor,* N. A.

Dated 22 nd. May 1943

## INTRODUCTION

Mr. G. Joseph Kavi is one of our leading poets in Telugu. On a former occasion I said as follows with reference to him:—

'The fact that a member of the Depressed Classes has attained such scholarship and power of language is evidence of the potential excelence of these communities and is a sad and serious reflection on the loss sustained by the inhuman treatment, social, spiritual, cultural and political, to which they were subjected through ages"

His works display mastery of language and technique and also fine powers of imagination.

The present volume The Message of Tears is a powerful representation of the miserable, the tragic life to which the Untouchables in Hindu Society have been reduced. There have been recently several Poets and Writers hailing from the Depressed Classes and writing in moving description of their terrible plight. If the worst feature of Hell is, as Milton said. " Hope never comes that comes to all," these poor pepole men, women and children have been living in a veritable hell bereft of every right and concideration extended to humanity, from which hope of higher possibilities or even relief has been extinguished. But no work on this painful theme equals in pathos Mr. Joseph's Message of Tears.

It is a remarkable tribute to the power of nationalism and the revolution produced by Mr. Gandhi with respect to the condition of the Depressed Classes, whome he has renamed Harijan, that the more thoughtful of their leaders like Mr. Joseph and B. S. Moorthy M. L. A. have not become so bitter as to desire the downfall of

Hindusim or to cut themselves away in to a separate state, a Harijan Sthan if one m y so call it. They take a Historical view of their condition. They recognise the efforts that are being made by Indian leaders to lift them out of their fallen condition and to elevate them to the full stature of humanity and citizenship. They realises that if their own countrymen cannot save them, the foreigner is not going to do that job for them. Certainly not the European. They see what is being done to coloured peoples in Africa, Australia and other lands and they have therefore come to the conclusion that they must look firstly to their own efforts and secondly to the gigantic moral forces remoulding India culturally as by the literature of Liberalism which is predominant to-day: religiously as by the gospels of Sree Ramakrishna Paramahamsa and Sree Dayananda Saraswathi, and the spiritual organisations started under their inspiration Politically by the nationalistic and democratic movements that have already produced a big change in their relative position; and socially by the reform movements which have been a very prominent feature in contemporary India. Some of the members of the Depressed Classes have been appointed to the highest posts in the State. Scholars and Poets like Mr. Joseph have been the recepients of public congratulations and honour and awards. In the last chapter of this book, the author mentions with generous gratitude, almost amounting to enthusiasm the different leaders who, in their measure and opportunitiesy have served the cause of the depressed communities. As I read it, I thought the higher castes amongst the Hindus should feel more shame than elation at the recognation so lavishly bestowed.

This Message of Tears is a poem that endeavours to stop the spread of the very natural bitterness that may be felt by the Depressed Classes and promote harmony of castes and communities by its large-hearted long-sighted views. it is a constructive and healing peom

Both, therefore in repect of matter and of its style, this poem must rank as classic. I congratulate Mr. Joseph on his noble thoughts, the moving pictures that he has painted, and the helpful, hopeful message he has delivered though with tearful eyes and anguished heart.

**C. R. REDDY.**

ఆంధ్ర విశ్వవిద్యాలయము

వైస్ ఛాన్సలర్: గుంటూరు,
సర్ కట్టమంచి రామలింగారెడ్డి. ముకాం — చిత్తూరు. 22-5-48

# పీఠిక

జి. జోసెపు కవిగారు తెలుగులో సుప్రసిద్ధ కవులలో నొకరు. మున్నొక సమయములో వీరినిగూర్చి యిట్లువ్రాసినాను. "నిమ్నజాతుల లోని యొకరు ఇంత పాండిత్యము, ఇంత భాషాశక్తి సంపాదించినటు ఆజాతులలోనున్న దివ్యమైన సత్త్వమునకు తార్కాణము. ఈ విషయము తరతరములుగా ఈ జాతులు సాంఘికముగా, ఆధ్యాత్మికముగా, సాంస్కారికముగా, రాజకీయముగా ననుభవించిన యసహాయమైన కష్టపాటువలన పొందిన మహానష్టమును గూర్చి, దానివిషయమై విచారమును శ్రద్ధయు గల భావములను రేకెత్తించుచున్నది.

ఈయన గ్రంథములయందు భాషా పటుత్వము, రచనాశిల్పము, సుకుమారమైన భావనాశక్తులును వెల్లివిరియుచున్నవి.

ఈ ప్రస్తుత గ్రంథమునందు (దీని పేరు "కన్నీటికబురు") హిందూ సంఘమున నస్పృశ్యులే స్థితిలో నుండిరో ఆ దుఃఖాకరము, విషాదకరమైన జీవితము గొప్ప ప్రతిభతో నిరూపింపబడినది ఈ నడుమ నిమ్నజాతులనుండి చాలమంది కవులును గ్రంథకర్తలును వారిదుర్దశను గుండెలు కఱగించునట్లు వర్ణించుచు వ్రాసినవారున్నారు. మిల్టన్ కవి చెప్పినట్లు సర్వజనులకు సహజముగావచ్చు ఆశాలేశము మాకు వచ్చుటలేదు. అని నరకముయొక్క పరమమైన దుఃస్థితిని చెప్పినట్లుగా ఈ పేదవారు స్త్రీలు, శిశువులు అట్టి నరకములో నున్నారు. సామాన్య మనుష్యునకున్న హక్కులులేవు. పాటింపులేదు. ఒక వృద్ధిపొందుటకు వీళ్ళుకాని, సాహాయ్యసంపత్తిగాని కలుగునన్న ఆశాజ్యోతి యార్పివేయబడెను. ఈ విషాదగాథను "కన్నీటికబురు" కన్న కరుణరస మొలుకు

నట్లు వ్రాయబడిన గ్రంథములులేవు. ఈ హరిజననాయకులలో ఎక్కువ బుద్ధిమంతులైన జోసెపుగారు, బి. యస్. మూర్తి, ఎం. ఎల్. ఎ. గారు మొదలైనవారు హిందూమతముయొక్క వినాశము కోరుటకుగాని, హరిజనస్థానము (అనుటకు వీలైనచో) అనదగిన ఒక ప్రత్యేకరాష్ట్రము తమకు కావలయుననుటగాని చేసెడునంత ద్వేషము పెంపొందించుకొనలేదు. దీనికి కారణము గాంధి. ఆయన యీనిమ్న జాతులకు "హరిజను"లని క్రొత్తపేరిచ్చి వారిప్పటిస్థితిలో తెచ్చిన పెద్దమార్పుయొక్కయు జాతీయతయొక్కయు శక్తికి యిది గొప్ప నిదర్శనము. ఈ పై జెప్పిన నాయకులు తమ నేటి దుఃస్థితిని చారిత్రకముగా పరిశీలించిరి. వారి సంఘమును ఈ పడిపోయిన స్థితినుండి లేవదీయుటకును, సంఘమునందును, మానవ సమాజమునందును ప్రకాశస్థితిని పొందించుటకు భారతీయ నాయకులు చేయుచున్న ప్రయత్నములను వీరు గుర్తించుచున్నారు వారిదేశీయులే వారిని రక్షించలేకపోయినచో పరదేశీయులు వచ్చి రక్షించిపెట్టరని వారికి తెలిసినది. ఆ పరదేశీయుడుమాత్రము యూరపుదేశీయుడు నిశ్చయముగాగాదు. ఆఫ్రికాలో, ఆస్ట్రేలియాలో, ఇతరదేశములలో నల్లజాతుల కేమి జరుగుచున్నదో వారు చూచుచున్నారు. అందుచేత వారీనిశ్చయమునకువచ్చినారు. ప్రథమశః వారు మహాప్రయత్నముచేయవలయును రెండవది ఈనాడు వృద్ధిలోనున్న స్వాతంత్ర్య సారస్వతముచేతను మఱి యితరములైనవానిచేతను భారతదేశము క్రొత్తమూసలో పోయుచున్న మహానైతికశక్తులను వా రనుకూలపరచుకొనుటకు చూచుకొనుచున్నారు. శ్రీ రామకృష్ణ పరమహంసయు, శ్రీ దయానంద సరస్వతియు సూక్తులచేతను తదుపజ్ఞకముగా జరుగుచున్న ఆధ్యాత్మక సంస్థలచేతను, మత విషయకముగా యీ క్రొత్త పరిణామము కలుగుచున్నది జాతీయత, ప్రజాస్వామ్యము మొదలైన భావములు నిమ్నజాతుల స్థితిలో రాజకీయముగా పెద్ద మార్పు తెచ్చినవి. సంఘసంస్కారమో ఆధునాతన కాలములో భారతదేశమందు చాల ప్రా

ముఖ్యము నందియున్నది. సాంఘికముగా ఈ క్రొత్తపరిణామము నిది యు పోషించుచున్నది. నిమ్నజాతులలోనివారు కొందరు రాజ్యాంగము లో పెద్ద ఉద్యోగములలోనున్నారు.

జోసెపు కవిగారివంటి పండితులు, కవులు ప్రజలనుండి ఆద రణములు, సన్మానములను పొందియున్నారు.

ఈ "కన్నీటికబురు" యొక్క చివరిభాగములో నీ గ్రంథకర్త వారిచేతనైనంతవరకు నిమ్నజాత్యుద్ధరణమునకై పాటుపడిన కొందరు నాయకులనుగూర్చి యొక యావేశము తెచ్చుకొని తన కృతజ్ఞతలను చూపుచున్నాడు. నేనీగ్రంథము చదువుచున్నకొలది నా కిట్లనిపించినది. భారతీయులలో నుత్తమ వర్ణములవారు ఇట్టి పొగడ్తను సంతోషించు టకన్న సిగ్గుపడవలసియుండును. ఈ కన్నీటికబురు అను కావ్యము నిమ్నజాతు లనుభవించుచున్న సహజమైన ద్వేషము వ్యాపింపకుండ ప్రయత్నముచేయుచున్నది. తన యుదారమైన దూరదృష్టిగల యభిప్రా యములచేత భిన్న వర్ణములయందును, భిన్నసంఘములయందును సా మరస్యమును పొందించుచున్నది. ఈకావ్యము సంఘమునందు క్రొత్త సృష్టికల్పించు కావ్యము. జరిగిన యపకారములు మరచిపోవునట్లు చేయు కావ్యము.

వస్తువునేత చూచినను, శైలిచేతచూచినను ఇది యొక పురాణ ముగానో, మహాకావ్యముగానో వన్నె కెక్కగలదు. నేను ఆయనయుదా త్తభావములకు, అయన సృష్టించిన సజీవమైన పాత్రలకు, కన్నీళ్ళతో నురియుచున్న యెదతో అయన యిచ్చినటువంటి స్నేహితునివంటి, ఆశాజ్యోతకమైనటువంటి సందేశమునకు నే నీ జోసపుకవిగారిని అభినం దించుచున్నాను

కట్టమంచి రామలింగారెడ్డి

# కన్నీటికబురు



## ప్రథమాశ్వాసము.

శ్రీ యహోబిల కవికుల శ్రేష్ఠ దివ్య
వాక్సుధా ధారలోయన వలను గులికి
దీప్తమౌ గుండె కా స్రవంతీతటాన
వెలయుఁ బూలవాడను నొక పేదపురము.

అంతములేని లేమి జవరాలి భయంకర తీక్ష్ణదృష్టి వి
క్లాంత మహాగ్నిలోఁబడి, యుగంబులు మేటరిరాటపాకు గ
ల్లంతుల దుఃఖనిస్వన విలాప పరంపర జిక్కి తత్పురీ
ప్రాంతముఁ బంచమాధముల పల్లెయొకండు తపించు జాలిమై.

బెడిదంపు గుంపెడు జడలప్రోవు విదల్చి
కటికి చీకటి లోయ నటనసేయు
ముంజూరు గుహల గీములబొంచి యుట్టాడి
కలిమితోఁ గలహింపఁ గవియుచుండు
వికృతరూపావని బికిరంబు లెత్తించి
గేలిసేయుచుఁ బరిటీలఁ గొట్టు
బహుళ కష్టంబుల పంకాన బడద్రోచి
యింటింటఁ దిరిగి కన్నెఱ్ఱఁజేయు

పూలవాడను తన రాజ్య భోగమహిమఁ
జెన్నలరఁజేసి, యినుప గజ్జెలనుగట్టి
కాఱుమబ్బుల తెరల లోకంబుఁజేరి
ప్రీతి నటియించి నగును దారిద్ర్యదేవి.

దీపించు నిర్మల తేజంబు లుడిగించి
రక్తమాంసముల సారములఁ బిండు
మానాభిమాన సంపద గంగపాల్సేసి
భయ పిశాచమునకు బట్టియిచ్చు
నిండు చింతావారి నిధి మధ్యమునముంచి
సాహసబీజంబు సమయఁజేయు
అతుల పాపజ్వాల లంకురమెత్తించి
పదుగురి నవ్వుల పాలుసేయు

బహు దూరాలోచనలకెల్ల పాడిపంట
అసదృశాహ్లాద జలనిధి కౌర్వదహన
మసమ దౌర్మార్గ్యమునకు నెయ్యపు వయస్యఁ
డనఁగ విహరించు లేమి గయ్యాళిపల్లె.

మురికి పదార్థంబు ముమ్మరంబుగఁ గ్రోలి
తులఁదూగు పోతుటీగల పసందు
నెత్తుటి మధురంపు నీటిలో విహరించి
మత్తెక్కి కులుకు దోమల హొరంగు

పలలేక్షురసమహా వనధిలోఁ గ్రీడించు
బలిసిన మత్కుణంబుల మజాఖ
వసనంపు దెసల సోపానాల మురియుచుఁ
బొలయించు చీరపోతుల బెడంగు

సందు గొందుల వెంబడి సరవిఁగట్టి
బరుగులెత్తెడి గుడ్లగూడల పిరంగి
జయజయ ధ్వానములతోడ సాటిలేక
వెలయు నేతాదృశస్థితి వింతపల్లె.

గల్ల యిండుల మధ్యఁ గాళ్ళ గజ్జెలుగట్టి
నటియించు శనికి దండములుబెట్టి
కలుఁగు గీములఁ బెండ్లి గావించుకొనెడి కొ
క్కుల సంగడీండ్రకు కొలువుసేసి
పంచ పందిండ్లలోఁ భొంచుచుఁ దిరుగు శ్వా
న తతికి గొప్ప స్వాగత మొసంగి
బూజు టుయ్యేలలలో భోగించు పెను మూషి
కాల గుమికి. నీతికథలఁ జెప్పి

తతకవోష్ణపు నయనాంబుధార జిలికి
ధైర్యదేవత విమల పాదాలఁ గడఁగి
లలిత మార్దవ హృదయగోళమును జీల్చి
ప్రణతు లర్పించుచుందు రా పల్లెజనులు.

మూలగ లాతిపోవగ ప్రభూత విషాదపు టగ్గికొండలన్
దాలిమితో భుజాగ్రమున దాల్చి, దరిద్రతదేవి తంత్రపుం
గాలపుటుచ్చులం దగిలి, కంటికి నిద్దురలేక కష్ట క
ల్లోల పరీత హృద్వనధిలోఁబడి చింతిలుచుందు రెంతయున్.

మరుగున డాఁగియున్ దెలివిమాలిన బీదల నాశ్రయించి త
త్పరమతితో విశృంఖల విధానక కార్ముక మెక్కుబెట్టి దు
ర్మరణపు దేవి చీటికిని మాటికి ఘోర దృగంచలాల నే
మరక నిగుడ్చుచుండు నభిమానము బేరిమినిన్ బవల్ నిశల్.

జుమ్మను మక్షికార్భకులు సోలుచు దూలుచుఁ బిండుగట్టి కం
చమ్ముల మీఁదికిన్ గవిసి జాతరసేయుచు నిర్భయాన హీ
నమ్ముగ గేయగుచ్ఛముల నాటకమాడుచు పాడుచుండు చి
త్తమ్ములు పౌడువాఱి పరితాప జుగుప్స తుఱంగలింపగన్.

దినమొక రక్తబిందువు గతించు విధంబునఁ గూలినాలిఁ జే
సినఁగడుపార నన్నము గ్రసింపక కాటుకబట్టి పేద ప్రే
వున జనియించు నిప్పుకల పొంగు నశృంఖల కీలజాలముల్
గనలుచు రేగెడిన్ గలియుగ ప్రభు నక్రమలీల దోఁపగన్.

అట నస్పృశ్యత ఘోరశక్తి భయ రోషాయత్తచిత్తాన భ్రూ
కుటిఁ బొంగించి కరాళ ఖడ్గతతులన్ గుంభించు ప్రాణంబులన్
ద్రుటిలోఁ గైకొనురీతి పర్యటన మెంతోఁజేయు జృంభించి వా
కిట తారాడెడి బ్రాహ్మణాది కులజుల్ గీపెట్టి వాపోవగన్.

కాకులు గ్రద్దలెల్లెడల కారులుగూయును రక్తవాహినిన్
దూఁకులువెట్టి తుందుడుకుతో జరియించు సృగాలజాలముల్
గేకలు వెట్టుచుండు గమకించి జొరంబడు గబ్బిలాలు చీ
కాకు జనింపఁజేయును వికారవిలాసము వెల్లడించుచున్.

మురిసిన పిల్లగాడుపుల ముద్దుల ముచ్చటఁ నాలకించుచు
న్మురియుచు నస్థిపంజరపు పూవుల దామములన్ ధరించి ని
వ్వెఱపడుచున్ గురూపమున విశ్వమునంతను భీతిగొల్పుచు
న్దిరుగు గృహాంతరంబుల బ్రతిక్షణమందునఁబోరు దయ్యముల్.

కయిపెక్కన్ గలుఁద్రాగి తమ్మెట భుజస్కంధంబునం దాల్చియు
లయ లాలింపులు సప్తతాళములు నీలల్ గొట్టి వాయించుచున్
భయదార్భాటము లంబరస్థలము గప్పన్ జిందులంద్రొక్కు నీ
తయితక్కల్ కులుకుల్ గులాచరణ విద్యల్ గావె గోసంగికిన్.

ప్రక్కతీపులు గాలి పరువెత్తుకొని వచ్చి
ముసలతొత్తులతోడ మురియుచుండు
ఎండమావుల దండు లెక్కసక్కెములాడి
కసవు కొంపలను చీకాకుపఱచు
జఠరాగ్ని భయద విశాల సూయాణంబు
బడుగుల మ్మూకతోఁ బంతమాడు
రోగాలదేవత క్రోధాన నింటింట
తెగులు చేర్చుకల్ల దిద్దుచుండు

పరువు పరువున పరుదెంచి పరిహసించి
చీము నెత్తురు జల్లులఁ జిందులాడు
చీమదోమల నంపడి చెప్పు నలవిఁ
గాక ద్విగుణీకృతంబులై జోఁక గాంచె.

'దిబ్బఁ' డను పేరఁ బెద్ద మాదిగ యొకండు
తనదు బిరుదంబు సార్థకత్వంబుగాగ
కష్టసుఖముల జమిలి నొకంటఁ దూచి
మెలగు నా పల్లెవాసియై తెలివిఁ గలిగి.

దొరలకు నిత్యకృత్యముల దొడ్డగ మెప్పుగ నాచరించుచు
న్నెరక పొలంబు నగ్గవుగ మేకొని, గర్వహీనుఁడౌచు త
త్పురమున మంచికీర్తిని బొందెఁ, పదుండ్రకు నోట నాల్కగా
దిరుగుచునుండె నిమ్నజుల దిక్కు గనుంగొను చన్నివేళలన్.

ప్రొద్దుగలుఁగ లేచి పొలఁతితోఁ దానును
కండ్లు బులుముకొనుచు కత్తి నారె
కాలెముంతలకును కడు భక్తితో మ్రొగ్గు
పొగల కాన్కలిచ్చి పొగడుచుండు.

అతని గర్భాన లేకలేక తనయుండు
జనన మొందిన కతన విషాదముడిఁగి
రాయ డను సమంజస నామధేయ మొసఁగి
పిలుచుచుండెను మోదాశ్రువులు స్రవింప.

కంటకావృత రమ్య సుగంధ పుష్ప
రాజముల వన్నెవాసి గూర్పకయె వచ్చు
పోల్కి, జెప్పరాని కులాన బుట్టి పెరుగు
రాయని గుణాలు జన్మతోఁ బ్రభవహించె.

ఏకైక సుతుని తెలివికి
సాకల్యంబుగను మెచ్చి సరసపు విద్యన్
ప్రాకటముగ జెప్పించెడి
పోకడ తలిదండ్రులకును బుట్టెను షేర్మిన్.

సజ్జనుం డొక బ్రాహ్మణ సత్తముండు
పొలము పోయెడి సమయంబు బొంచిచూచి
దారి కడ్డేగి వణకుచు నోరురాక
పదయుగంబులపైఁబడి ప్రణతులొసఁగి.

ఒక్కడనఁగ నొక్కడె కొడు కుద్భవించె
నాకు, చదువు జెప్పుముసామి! నాకు దగిన
మంచి కాన్కతోపాటు చర్మంబుగోసి
పాదరక్షల నర్పింతు బత్తిజేంది.

అనియెడి వానివాక్కులకు నా ధరణీసురు వెన్నవంటి మె
త్తని హృదయారవిందము వితావితరూపముజెంది యెంతయేఁ
గనలుచు, రామరామయని కర్ణయుగంబున రెండుబ్రేళులన్
జొనుపుచుఁ గండ్లుమూసికొనె జుమ్మతుపానులు కొల్లగొట్టగన్.

కొంతసేపటివఱకు కక్కుర్తిఁజెంది
తాలిమివహించి శరణాగతాళి హీన
మైనఁ దరిఁజేర్చ గన్నను, నాదరింపు
పల్కుల వచింప సార్యులు పాడియుండ్రు.

అని వగచి కొంత తడవున
మనమున గోపంబునణచి మాదిగవానిన్
గని, గనికరము జెనంగొన
గను, బలికె శరణమొసంగు కాంక్షాపరతన్.

చెప్పగరానివాడవని శ్రేష్ఠులు నిన్ వెలివేసినారు ము
న్నెప్పుడొ కొన్ని దుష్కృతము లేర్పడియుండుట రోతగించి నీ
కప్పటినాఁటినుండి పురి యావలి సీమలె కాణయాచిగా
ముప్పులఁ బొందుచుంటివి, ప్రభూతవిషాదము సందడింపగన్.

ఒకచోట స్థిరముగనుండుట దోషంబు
దేశదేశంబుల దిరుగవలయు
చచ్చినవాండ్ర వస్త్రాలు భావ్యముగాని
క్రొత్త పుట్టంబులఁ గూర్పదగదు
అప్పులువెట్టి మిఘ్మడుగుట హీనంబు
వేటనాదంబుల వినుట తప్పు
సేవకావళితోడ చేతిలో నన్నంబు
గుట్టుగా గుంటల బెట్టనగును

రాత్రిరులయం దసలు నగరాలయందు
దిరుగగూడదు, పగటిలో దిరుగవలయు
నన్న భూపాలు ముద్ర భుజాగ్రమందుఁ
దాల్పగావలెనోయి నీ ధర్మమిద్ది.

ఖర శునకంబులే ధనము, కాటి సమీపమె యుండుచోటు దు
ర్భరమగు లేమి దైవము చిరంతిమలీమస భూషణంబులన్
మిర ధరియింపగావలయు, మృత్తిక పాత్రల నన్నపానమున్
నిరతము జేయగావలయు నేస్తులు దయ్యములో కులాధమా.

నాలవ జాతివారు విడనాడిరి మూర్ఖపు గార్య పద్ధతుల్
గాల గుణానురీతి నది కారణమౌటను కొన్నికొన్ని సం
ఘాలను హక్కు లిచ్చితిమి, కాని త్వదీయులు నీచకార్యపున్
జాలము మానకుండుట నిజానికి దూరగులౌట గల్గెడిన్.

తరతరంబులనుండి దాచియుంచిన నీచ
కార్యాలు నీకు బంగారుమేడ
తరియింపగారాని దురిత పరంపరల్
వాసికెక్కిన నీ మిరాసిహక్కు
పెద్దకాలమునుండి వెల్లువగవచ్చెడి దురా
చారంబులన్ని నీ జనకునాస్తి
అనిశంబు తెక్కలనమ్మి జీవించెడి
బ్రతుకు చేయుము నీ తపఃఫలంబు

ఎంతయుండిన నీపూట నింటియందు
పుల్లతిర్లిక వెలుగుదు మల్లగంజి
మల్లమట్టు కొల్లాటము పిల్లదండు
లేమి చేయను నే శాప మిట్టులుంత.

ఆటిగా కారణమౌట నీ బిలకు విద్యాబుద్ధులన్ నేర్పఁగూ
డదు, నేర్పించినవాండ్ర బంధితులనల్పున్ మన్వు శాసించె నీ
మూడలన్ దాటుటయెట్లు ? నీమనవి నామోదించి నీ బిడ్డకుం
జదువుంజెప్పుట యెట్లు ? జెప్పినను నన్మత్ప్రాణముల్ దక్కునే !

అనుచు వచియించి యా బాపనయ్యగార
లింటి కేగిరి, ప్రాణంబు లెట్టులెట్టొ
దక్కనవియంచు దిబ్బ డులిక్కిపడుచు
తిరిగిచూచుచు గొంపకు మరలిపోయె.

అసలు రత్నంబు శాణ సాహాయ్యభాగ్య
మందకుండనె స్వారోచియై వెలుంగు
పగిది, ప్రకృతి జవ్వన సేనఁ బ్రాలుపోసెఁ
గీర్తి వరియించె దాయని మూర్తిఁగాంచి.

కులమింటి కోఁతిపిల్లను
చెలువుగ రాయనికి బెండ్లిఁజేసిన నటపైఁ
దలిదండ్రులు మరణించిరి
తలకొఱవియనన్ గుటుంబతాపమునఁ బడెన్

కాల మొకరీతిగా నెల్లకాల ముండ
బోదటన్న చందముగాఁగ, బూర్వ దిక్కు
భానుఁ డపరాశఁ జేరెడి పగిదిఁ గాల
చక్రమున గొన్ని మార్పులు సంఘటిల్లె.

కామినీమణియగు నిజకాంతయందుఁ
బుట్టి పెరిగెడి యేడ్గురు బుతుత లందు
దుగ్గియను తొలిసారి కూఁతునకు గొంత
చదువు జెప్పించె మాతృభాషను ముదాన.

శీల గుణప్రధానుఁడు, విశిష్టుఁడు కల్మికి మించుదాత, దు
ష్కాలమునందు జింతిలని కారణజన్ముఁడు జన్మమాది పా
పౌఁను దూఱుమేటి గుణవంతుఁడు సత్య వచఃప్రధానుఁడై
కాలగుణానురీతి మెలగంగను జొచ్చె వితర్కబుద్ధితో.

స్తుతి సైరింపని కీర్తిమూర్తి, కరుణా శోభాత్ముఁడున్ సాత్త్వికో
న్నతిచే గర్వపు వైరినిం గెలుచు, సంతాపంబు పోనాడు, దు
ష్కృతులంజేయడు, ధైర్యమున్ విడువఁ డే జీవాపహంబైన బె
న్వెత లేతెంచిన న్యాయమార్గమును సంప్రీతిన్ విచారించుచున్.

అతని ప్రశస్త ధైర్యాదిసానువులందుఁ
జేరి భీరులు ధైర్యశూరులగురు
రతని నిస్తుల కటాక్షాపాంగ సుజ్ఞాన
సూక్తి మూర్ఖులు జ్ఞానశుద్ధిగందు

రతని సహన సౌధ వితతి వర్ణనజేసి
గుణయుతులైరి దుర్గుణమువారు
అతని సచ్ఛీల విశుద్ధాంగ తటములు
పరము జెందిరి విజ్ఞాత్మలందు

ఆతని గాంభీర్య శాంతి దాంత్యాది రత్న
కాంతిపుంజము జ్ఞానాంధకార మడప
తన్మయత్వంబు నొంది సొంతమును మఱచి
తనియుచుండిరి ప్రజలు తన్మనియుటంచు.

కళాంతల జెందు బీదల మొగంబుల వాడుబువాఱు పండుటాకులఁ దిలకించి తీరని యకుంఠిత దుఃఖితమః ప్రపంచ వీథుల బరితప్తుఁడై కుమిలి తోరపుటార్తిని దోఁచ కేదియుం గల ధనమెల్లబంచును వికాస దయాగుణ ముల్లసిల్లగన్.

కన్నీటి మిన్నేటి గట్టుపైఁ దఱపోయుఁ
బేదల దరిలేని వేదనముల
బీద వెన్నెముకల భీకరాశ్రుతుల బాడు
కడగండ్ల గేయాలఁ గఱవుఁదీఱ
క్షామంపుటడవి ప్రక్కనుజేరి పలవించు
గ్రాలుదోక్కల శోకగాథలెల్ల
పూరింటి రొంపిలోఁ బొరలియాడి తపించు
బడుగుల చార్మిత భాషగీతి

సోలి చెమ్మట నెత్తుటి సోనలందు
నాశ్రయపు టాతపత్ర సౌఖ్యములఁబేడు
దొరకమికి గుందు, నిరుపేద తెరువులరసి
చపలచిత్తంపు వీధుల సంచరించు.

చెమటకు మాఱు శోణితముఁ జింది కవోష్ణపు టశ్రుబిందు తో
యముల మునింగి, నిబ్బరపు టారతి పూజల సంకటాల దై
వమున కొసంగు పేదల యవారితజీవిత మర్మమెంచి చి
త్తమున వితర్కముం జలుపు దా నొనరించెడి కార్యపద్ధతుల్.

కలవాడైన మిరాసి హక్కులకునై గష్టంబు లెన్నేని వా
టిలినంగాని, సహించి వల్దనక పోటీగాంగ్ర మన్నించి కా
పుల కారుణ్య కటాక్షమున్ బడయ ముప్పొద్దెంతయో చాకిరిన్
గలఁతన్జెందక నాచరింపదొడగెన్ కాలానుగుణ్యంబుగన్.

బగ్గున మండుటెండలకు ప్రాయపు భాగ్యము గుత్తకిచ్చి తా
బుగ్గఁ బొగాకు తమ్మఁగొని బువ్వ రవంతయు ముట్టకుండ నే
మొగ్గగు బత్తితోఁగలుగు మొత్తము చాకిరి కాఁపుటిండ్లలో
సిగ్గుఁ దొరంగి చేసెడిని చెమ్మట బిందులు జాలువాఱగన్.

నీటికి మారు రక్తమును నింపి పొలంబుల మెత్తపర్చి ము
ప్పూటలు సాగుజేసి, తమిపూఫ వయస్సును నాహరించు దే
హాటవిలో జనించెడి శ్రమాగ్నుల కీలలఁ దాపమాపి, యే
టేట ఫలింపఁజేసి తమ యేలికకిచ్చును భాగ్యసంపదల్,

నెత్తిన పాగజుట్టుకొని నేత్రము లెఱ్ఱఁజేసి మేనఁ గ్రొం
గ్రొత్త హారిద్రముం బులిమికొల్పిన కత్తి కరానబూని మో
మెత్తిన సత్తిగిత్తి పండలెత్తెడు సత్తువ గల్గియుండి కిం
చిత్తగు కాఁపు కఱ్ఱకు కృశించుచు దాగు నిదేమి మర్మమో!

యజ్ఞయాగాదులం దసువుల నర్పించు
సిడి పెండ్లికొడుకనై జెలఁగుచుండు
పత్తియుత్సవమందు బొత్తున నూరేగు
యజ్ఞపురుషుఁడునై యలరుచుండు
కొలువుల సురలకు తొలుత హావిస్సుల
నర్పించు మొనగాడునై మెలంగు
దురితంబులను బాపఁ దుడుచు మాతంగికి
ససుఁగఘ తోఁబుట్టువునై వెలుంగు

నగ్రగణ్యుండునై గల యాధిపత్య
ము శిరసావహించి సమస్తమునకు నేనె
యంచు నధికారము చెలాయించి తుదకు
నెంగిలిమెతుకు భుజియింప నిచ్చగించు.

పండువెన్నెల గుత్తి పసదనంబును మించు
తెలుపారు తగరంపు దీగె నదికి
జిలుఁగుఁ జెంగావిరంగుల పస కెనవచ్చు
నజరైన వింత బనాతుఁ బొదిగి

పసుపుపచ్చల గేజీ తెచ్చిబంగరు మించు
గమకంపు క్రొత్త బేగడను దాపి
జాతి రత్నాలకు సాటియౌ వెలఁ జెప్పఁ
గులికించి మించు పచ్చలనుగూర్చి

వెలకుమించిన కిఱ్ఱుచెప్పులను గుట్టి
సర్వ వస్తుప్రదర్శనశాల వలపు
టంగడుల దేవ శిల్పుల కన్నుకొనుచు
మఱియు తనసాటి పనివాడు దొరకడనుచు.

దయ్యాలమూకతో సయ్యాటలాడుచు
నిలువ నీడయులేక మెలఁగుచుండు
పురుగులు బొరలాడు బొచ్చెల గుడుచుచు
బిడియ మించుకలేక ప్రేలుచుండు
బిరుపోకను పెగ్గుపిండుల జాబితా
దినదినంబును వ్రాయఁ దిరుగుచుండు
భూతిరేఖాళితో భువనాల నెల్లఁ బా
లించు భార్యార్తి సహించుచుండు.

సట్టి ముక్కంటికి శవకు న్యాయమునకు
భేదమే లేదటంచు నిర్భ్రీకే వృత్తిఁ
బట్ట పగ్గాలులేని సంబరముతోడఁ
బొల్చుకొనుచుండు శుభయముల పోలికలను.

దినకృత్యంబుల నేరు దిట్టిసను నుద్దీప్తోగ్ర రౌద్రాంక భా
వనషే గొట్టి పరాభవించిన నమోవాకంబు లర్పించుచుం
డునుగాని, మొగమెత్తిచూడ డెదియు న్యూనంబగున్గాక యా
తని యోర్పెంతయు శ్లాఘనీయమగుగాదా యెంత చర్చించినన్.

ఏడాది పొడుగు విసువక
తేడాలు మఱేమిలేక తేఁకువతోడన్
నాడెం బలరఁగఁ జెప్పుల
జోడులఁ బొనరించు దొరలు సొంపుగ మెచ్చన్.

హీనపు వృత్తు లన్నిటికి నేనెయటంచును గాలుద్రవ్వినం
గాని వృథా కడాపటికి, కళ్ళమధోగతి నుంటిగింజలే
వానికి మేరఁబెట్టుటకు స్వామికి జిక్కెడి మేలుపంట యె
ట్లేని సహించుఁ దొల్లి విధియించిన కట్టడి మార్పునెందినన్.

ఎన్నికష్టాలుఁ బెట్టిన నెన్నుకొనక
కాఁపు కొక్కంట కష్టంబు గలిఁగెనేని
కంటనీరుల రాల్చు చింటింటఁ దిరుగు
తనకు కీడేమొ దాపరించిన విధాన!

రైతుల నమ్మి పాపము విరామముగామి దినాంతమంత యెం
తో తపియించి నమ్మకముతోఁ బనిబాటలు నాలుబిడ్డలుం
జేతులువోవ సొమ్ము సిలఁజేసిఁ వణంకుచు గొంగుజూపి, అ
య్యా! తమ చిత్తమన్న నొకరైనను బల్కరు కూలినీయగన్.

గొనముల ప్రోవై తత్పుర
మున వెలుగొందుచును యశముబొందిన హీనుం
డని పలుపురు బిలుచుటఁ గని
మనమున దుఃఖింపఁ దొడఁగి మసలుచునుండెన్.

అఁకట సోలియాడుచు దినాంతము గుందుట హీనవృత్తిచేఁ
గాకులరీతిఁ గన్పడుటగాంచి సహింపక రెంటిమధ్యఁ బిం
డీకృత చిత్తుడై నలిఁగి నీచపువృత్తులఁ గొన్ని బాపఁగా
బ్రాకట కార్యభారమున రాయఁడు బూనెఁ దదేకదీక్షతో.

కారణమేమి మోపక యకారణవైరపు శృంఖలంబులన్
దీరిచి కట్టినారు విడదీయఁగజాలని బంధ సీమలో
భారత సోదరుల్ నగరువాపియు నైచ్యపు దాస్యవృత్తి దు
ర్భార మొసంగి పంచముల పాటు విచక్షణ సేయకుండఁగన్.

వ్యసనాధీనము, భీతిదాయకము సేవావృత్తిచేఁ గల్గు పా
యసముఁ మెక్కి సుఖించుకంటెను స్వతంత్రాధీనులై గంజినే
యస మామోదముతోడఁ ద్రాగి నిజ జాయాపుత్రవర్గంబు తో
డ సుఖంబుండుట మేలుగాదె పెఱజాడల్ విస్మృతిం జెందగన్.

త్రసరేణూత్కర సామ్య సేవధుల సంధానించి భోగోప లా
లసులై బీదల దేహ కాష్టములతోడఁ సౌధముల్ గట్టి వె
క్కస గర్వంబున పాపపుణ్య పరిపాకంబుఁ విసర్జించి నా
రస లీ భారతసోదరుల్ స్వజన సౌఖ్య శ్రేయముస్ గోరకే.

వినువక రోఁతగింపక వివేకము నౌదల మేల్ గిరీటమై
పొసఁగగ విశ్వభూవలయపున్ మలినంబును బాహుపీఠిఁ బై
వ్యసనములేక దాల్చి మఱియాదకు స్థానమొసంగి యొత్తిసం
గసరుచునున్న హైందవుల కర్మ మదెట్టుల దెల్లవాఱునో!

శృంగము భంగమై జివికి సిగ్గుఁ దొఱంగియు కూడులేక గో
సంగులు దాస్యవృత్తులకు సాగిరటంచును భారతీయు లె
ల్లం గశువేడ్కతో నగుట లాభమదేమి? విదేశ సేవలో
గ్రుంగుటలేదె? వారు తమ పూర్వపు భోగములెల్ల మాయగన్.

ఇది నాదేశము తెల్గువాఙ్మయము నాకింపొందు మోక్షంబు సం
పద నాతెక్కల కష్టమై భరత భూమాస్తన్య సారంబునన్
బదునై మొల్చిన మొక్కలం దొకడనై నానావిధార్తంపు బా
ధలన్ జెందుచునుంటి స స్మరసి ప్రోవన్ దిక్కులేడొక్కడున్.

నా తనూ శౌర్యసుందరతఁ గ్రుంగి భరత
భూమిని నెఱఁబాసి పోవునాఁడు
నా యమాయకపు సంతాన కల్పతరువు
మూలంబుతోఁ గూలిపోవునాఁడు
నా రక్తపు ప్రసరణా శ్లాఘ్యావము శిథి
భూతమై మాయమై పోవునాఁడు
నాదు తెక్కలశక్తి ఖిలమొంది విదేశ
ముల బొట్టఁజేకొని పోవునాఁడు

చెమ్మట వెలార్చి సిరిఁ బ్రోగుజేసి పెట్టి
పంటల పలంతికి బహుళ ప్రతిష్ఠఁదెచ్చి
ఆఁకట దపించు నాగతి నరయకున్న
భరతఖండాని కేగతి పట్టగలదొ ?

షట్చక్రవర్తుల శౌర్య కీర్తి చిరంటి
దర్శన ప్రాప్తంబు దప్పెననుచు
ప్రాచీన నగర సౌభాగ్య విధులఁ గులా
నగ ద్విరుగు మహాత్తు సమయునంచు
భాస్కర ప్రభు దానవాః ప్రవాహంబులోఁ
దాసమాడెడ్డి వ్రాఁత దప్పెనంచు
కాఁపుటిండుల యూడిగపు సిరి సూరేగు
గరిమంపు కొలుపులు దొఱకవంచు

కలుముల పడంతిరిఁ బురిటిగడ్డయైన
భరతఖండంపు బొలిమేర బాసినేను
జేనేఁడైనను సాగిపోలేని కొఱఁత
చేగదా అక్కటా యిట్టి చేటుమూడె.

పసరు దిద్దన లేఁత పచ్చిక బీళ్ళలోఁ
దులఁదూగుఁ పోతుటెద్దులకునైన
వాయు తరంగాలపైఁబడి మేతకైఁ
బరువెత్తు పక్షి దంపతులకైన

దినమంతఁ జేచాచి తిండికై స్రుక్కుచు
క్షితిని నెమకు నల్లచీమకైన
మానవ రుధిరంబు మస్తుగ దెగద్రావు
బలితంపు గోడె బెబ్బులికినైన

. . .

దిక్కుగల్గెను గాని, నా దిక్కునరసి
కుల మతాదుల భేదంబుఁ గొరతబాపి
నా విషాదంబు లెడబాఁపు నరుడులేడు
భరతఖండమా ! నా నోము ఫలమదేమి ?

సర్వసామాన్య మనుజుల సరస నెదుగు
హక్కులైనను పాటింపులైన లేవు
కలుఁగునన్న నాశాజ్యోతి కాలమహిమ
లస్తమించె, ప్రశాంత భాగ్యంబులెట్లు ?

నన్ను తృణీకరించు విధి న్యాయమొ నీచమొ చెప్పలేను నే విన్నది కాని కారణము. విస్తర విస్మృత జీవితాది సంపన్నతలన్ దలంచిన గుభాలున మిన్నులు వెన్నుఁగూలి యాపన్నతఁ గల్గు నా విమల భారతదేశము వంక జూచినన్.

ప్రస్తుత మనుభవించు ప్రశస్త కాల
మే కదా నాది, రానైన మేలు కీళ్ళ
కారణము భవిష్యత్కాల గర్భమందు
నిమిడియున్నది యెరికి యెట్టులగునొ ?

అని చింతించుచు నాఁడఘాంధ్రకుల మాద్యంతంబు రావించి ప్రే మను బొంగించి, స్వ జాతికష్టముల సమ్యగ్భంగి వర్ణించి చె ప్పిన వారందరు సమ్మతించి యొకటై వేదోక్తిగాఁ జిత్తమం దున భావించియు సమ్మెగట్టిరట యెంతో శౌర్యసంరంభులై.

పను లేవియుఁ జేయఁగ రా
దనియును, రైతుల గృహాల దరికేగఁగ రా
దనియును, దప్పిన వెలియని
యును, కదపాఁ బుచ్చుకొనిరి యెక్కుమ్మడిగాఁ.

అనాఁటినుండి రైతుల
చేనులుకుంబోక. పనులు సేయక యొకటై
పూనుచుఁ గదపా సమ్మెను
మానుగ నెఱవేర్పఁ గడఁగి మనుచుండిరెటో !

రాయని శాపంబులకు జాళ్ళు చలించె, పురంబు నంతటన్
రాయిడి సంభవించెను నరాజక దేవత పొంగి యగ్ర జా
తీయుల కార్యదుర్గముల దివ్వియకంబపు బాకులెత్తి కో
పాయత చిత్తతన్ గసరి వ్యాపనఁజేసెను దుండగంబులన్.

ఇఁక రాయం డిటనుండి నట్లయిన నెంతేగీడు వాటిల్లు త
ప్పకయంచున్ గలగుండుతో గితవపున్ వైషమ్యముల్ రేపి యొ
ద్దికతోఁ గాపులు వాని యాస్తిని పరాధీనంబుగావింపఁ దా
నికి పన్నాగపుటుచ్చు లొడ్డిరి క్రుధాన్వితస్థితిం బెల్చనన్.

ఉన్న ధనంబులోన సగ మూడక బీదల కిచ్చివేసె, పో
యున్న సగంబునంతఁ గపటోష్టుల బన్నుడు మోసగాండ్రు తా
రెన్నొ విధాలలాగి రతఁడిప్పుడు పాపము తిండిలేకయుం
ఖన్నపుటిల్లఁ జిక్కుకొనె బాపురమంచని విష్టువేళ్ళగన్.

కడకు తిరిపెంబునెత్తియుఁ బిడికెడన్న
మైన బిల్లల కిడలేక, యాలి పొగిలి
యలమటింపఁగఁజొచ్చె నయ్యతని మేలుఁ
దొలుతఁ బొందినవారైనఁ దలఁపరైరి.

కాలమహిమ యదెట్టిదోగాని, వితత
మంగళాస్పదమైన యా మందిరంపు
దివ్వె, వన నెయ్యికైనను దిక్కులేక
గబ్బిలాలను రమ్మని కబురుజేసె.

గాటపు యుద్ధదేవత జగంబున బూర్తిగఁ జిమ్మరేఁగి చె
ల్లాటల నాడఁజొచ్చెను, ఫలప్రద వర్షములేమి పంట లా
యేట ఫలింపకుండె మఱి యేరిని యాచన సేయకుండగా
గాటకపుం బిశాచి తన కన్నులవిప్పె భయానకంబుగన్.

వలసను బోవగ రాయఁడు
దలఁచె మఱేదేశమయిన దదుపరి ప్రాణం
బులు దక్కిన రాఁదగునని
కల బంధులతోడ మనవిఁ గడ కొఁగిజేసెన్.

త్వరగ బరువెత్తి పొలను ద్రావుచున్న
నిలచి సిద్ధార్థపుటయె మేలు, దలఁప ననెడి
వాక్కు నిక్కంబు, చాలనివాఁడు కనక
శైలసంగతిమున్న బిచ్చంబు విడడు.

అనియున్ బందుగు లెన్నిచెప్పినను జింతాకంత బాటింపకుం
డను తద్బంధుల యశ్రుతోయముల స్నానంబాడి క్షుద్బాధచే
తను దగ్ధంబగు నాలుబిడ్డ గమిఁ జేతంబూని కన్నారగాఁ
డనవారిం గడజూపు చూచెను తమంతఁగా గారె దుఃఖాంబువుల్.

పలుసబోవను బొత్తిగ వాంఛలేదు
గాని, విధిని జయింప శక్యంబుగాక
పోను వెనుకముం దాడుచుఁ బురముపీడఁ
బ్రాణమొప్పక యెట్టులో బయనమయ్యె.

బిడ్డలు సొదచే నేడ్చిన
వడ్డింపను గూడ కడకు వారలచేతన్
తెడ్డెడు మెతుకులనైనను
నిడ్డ దయాళుం డొకండు నెట లేడయ్యెన్.

బందుగులెల్ల వెంట నడువంగను రాయఁడు ముంచి చెడ్డ లం
దందున ముచ్చటించుకొను చావల నీవల మూగియున్న వా
రందఱతోడ జెప్పుచు బ్రయాణముసేయ నుపక్రమింపగాఁ
దుందుడుకుల్ బెతెలుమని దుమ్మిరి వాని ప్రయాణమాపగన్.

కడుకొని వీడలే కతని గాంచుచునుం గనుచూపుమేర కా
ల్నడకన బందులెల్లరు విలాపముజెందుచు వెంటఁబోయి ప్రే
ముడిఁ దళుకొత్త హత్తుకొని పొమ్మనజాలక యాయువున్న యె
ప్పుడయిన జూచుకొందమని బోధలుజేయుచు వెన్కకేగగన్.

కనలుచుఁ దల్లిపిల్లలును కాపురుగ్రమ్మెడు దుఃఖగాధ నుం
గని విడిపోవజాలక యగమ్య భయంకర భూమిశోక పు
న్వనధి తరంగడోలికలపై విహరించి గడంగివారు వీ
రును విడిపోయిరెట్టులో విరుద్ధపు గాలము సంస్మరించుచున్.

ప్రథమాశ్వాసము సమాప్తము.

# ద్వితీయాశ్వాసము

కుంకుమ పూలచెండును గొన్నిటిఁ బ్రాకృతి ముద్దుతోట యం
దుంకువగా గ్రహించియు, సముజ్జ్వల గిరణాలకుంచె లి
ర్వంకల దాల్చి నిత్యము సరాసరి ప్రాంతలువాఱు సృష్టికిం
బొంకపురంగు వేయుటకుఁ బుట్టెఁ బతంగుఁడు చిత్రకారుఁడై.

అది గౌరీశ్వర ఫాలనేత్ర శిఖి నుయ్యాలలూపు గ్రీష్మంబు! తు
మ్మెద ఝుంకారపు మాధురీ ధురిసమున్మేషప్రభల్ హెచ్చె, వా
రిద ఖేంఖాణపు నాట్యపున్ గతులుమాఱెన్ జాతవేదుండు స
మ్మదమొప్పన్ గబళించె భూసతిని సమ్యగ్భంగిఁ దీండ్రించుచున్.

నిండు వేసవి యెండయు, మండుటినుక
పంచభూతాత్మకంపు బ్రాపంచికమున
పసరువయసున రోమకూపముల దూఱి
దాహవాగురఁ బన్నె నిర్దయ వహించి.

మలయ దవాగ్నిధూమ మను మాసిన చీరె చెఱంగు చాటునం
గల జగమెల్ల శోభనవికాస విభూతిని దాఁచి గాలి ఘో
రలపయిమండు దుమ్ముల యెడారులఁ బర్యటనం బొనర్పఁగాఁ,
దలకొనె శీతవారి ఘటతండము లించుక సేదదీర్పఁగన్.

ఎండమావుల పైన నెక్కి పిపాసచేఁ
గొడకొని యుఱికెడు కొదమలేళ్ళు
సుడిగాడ్పు దండులజూచి వెఱగంది
పొదరిండ్ల నక్కు బెబ్బులులగములు
కలుఁగు టిండుల తీక్ష్ణకర బాణములకొగ్గి
నా సిరిలు ముదికొండల యవస్థ
సెగల రాపిడిబుట్టు పొగలకు ప్రాణంబు
లన్నంటి సొక్కు విహంగ సమితి

కరువలి సఖుండు వెన్నంటి కౌఁగలించి
మేలు పరువంబుతో సురటీల వీవ
నిచ్చవచ్చిన రీతి ముచ్చిచ్చు జెలిమిఁ
బతగుఁ డద్భుత రూపాన బ్రభవహించె.

వాఁడిపోయిన భూదేవి వదనమరసి
లలిత లతికలు క్రొవ్వేఁడి లంకలందు
ప్రభఁ దొఱఁగి విషాదానఁ బండుటాకు
క్రొత్త కన్నీటి జిల్లుల గురిసెనపుడు.

పిడికెడు కూటికై నెమకు బిడ్డలు రోదన సేయుచుండగాఁ
బడుఁతుక నేత్రబాష్పముల వార్ధి జనించు మహౌర్వకీలలన్
గాడఁగి తపించుచున్ దెఱవుగానక గొందొక దుర్గమాటవిన్
బడినడువంగగాఁ దొడఁగె బాసట లేమి న లాయుఁడార్తితో.

అన్నములేక బిడ్డలు సమంచిత శక్తిని వీడనాడు చా
పన్నులునై తపించుచు విభావసు తీక్ష్ణత కోర్వలేక లే
వెన్న విధంబునన్ గఱఁగి వేసటతోఁ దలిదండ్రి వెంటయుం
దిన్నగ నడ్చుచుండిరి· విధేయత మోము లలంకరింపగన్.

అడుగులు తొట్రుపాటుబడు చక్కిలిజెంది నరాలు గుంజుచు
న్నడువగలేక స్రుక్కి పదనంబుల నెత్తుటి చుక్కలేక మ్రా
న్పడి వెనుఁజిక్కు కొందఱను పజ్జకుఁజేరిచి బుజ్జగించుచున్
బడలికదీర్పఁ గొంత నిలువంబడు, సేయుఁ బ్రయాణమాపయిన్.

బొత్తిగ సొక్కిసోలి పడిపోవుచు కేవుకురాక మూర్ఛిల్లెడిన్
నెత్తురుగందులంటె తన నేదరబిడ్డల వీపు మోఁపునం
దత్తరతోడ నెత్తుకొని హాస్య విచిత్రపు గల్పనా కథల్
జిత్తములెల్ల రంజిల వచించుచు తాలిమి సందడింపగన్.

కడుపు జిచ్చున నలిదేరు బుడుత.గమికి
యన్నమొసఁగిన మంట చల్లారుగాని
శాంత వచనంపు గథ లెన్నిసార్లు చెప్పి
బుజ్జగించిన లాభంబు పొసగగలదె ?

చీమలపుట్ట నిప్పుకలచేత దహించు విధాన నెన్నియో
బాముల కిక్కయై కలఁతఁబాటి క్షుధానల దగ్ధదేహులై
గాములతేని తాపమున గ్రాఁగిన నెత్తురు ఘర్మరూపమై
భూమి స్రవింప దిగ్భ్రమనుబొందు నిసుంగుల తిప్పలేమనన్.

అలవిదప్పిన సృష్టి శృంఖలల వశత
గ్రస్త బంధింపఁబడియు విశ్రాంతి లేక
యార్తిఁజెందుచుఁ గుములు కార్యాంతకమునఁ
బాలనముసేయ మఱచెఁ గాఁబోలు క్షితిని.

ఎత్తుకొనకున్న నడలేదు బొత్తిగను మ
ఱెత్తుకొనుటకు గడుపులో మెత్తు లేదు
బిడ్డల మొగంబుఁ జూచిన ప్రేవులన్ని
తఱుగుకొని పోవుచుండెను తండ్రి మదికి.

కాళ్ళు తీపులుపుట్టి కదలజాలక వేడి
కన్నీటి సోనలోఁ గ్రాఁగిపోవు
కడుపులో సొదచేత వడిసెడి బిక్కమొ
గంబున దూలి ప్రకంపమొందు
దప్పిచే నోరెండఁ దత్తరంబున లేచి
మృగ తృష్ణవార్ధుల మీఁది కుఱుకు
వడగాలి పోతకు వత్తులై కడు డస్సి
యల్లాడి వాపోవుచలవటించు

కాలవాహిని మాయ భంగముల జిక్కి
యంగసౌష్ఠవ బలము లన్నంటిపోవ
నలిగి వచ్చిపోవు కొన ప్రాణమ్ములతోడఁ
బయన మొనరించుచున్న పాపలను గాంచి,

గొనముల కాటపట్టయిన కూర్మి పితాగ్రణి సౌహృదంబునుం
బుణికిసరీతి, సూదిమొనఁ బొడ్చినరీతి, విసంపు వాఁడి క
త్తినఁ దెగగోసి చీల్చినగతిన్ గడు గాసిలనొచ్చు తన్మయం
బున విలపింపగాఁ దొడగె ముప్పిరిఁ జిక్కినవాని చందమై.

తనయులుపొందు బాధల విధాన పరంపర లాత్మ రాజ్యమున్
జనకుని కొల్లగొట్టినఁ బ్రశాంతము జెందుడు నాత్మ తేజమౌ
టను నెవ రెట్టులన్న నొకటన్, గులకాంత విచారచిహ్న మా
తని హృదయారవిందము వితాకునొనర్చెను నొచ్చునన్ భ్రమన్,

భర్త గడియించు బదవల బల్లిదంపు
టుచ్చెడలఁ జేయఁజాలక నొచ్చుకొనుచుఁ
దన పతివ్రతా ధర్మ విద్యాప్రబోధ
మహిమ వెలిగించె సతడు సంబరముజెంద.

పదపద్మముల ముందు బరువెత్తు శీలంబు
విసయంబు మేని ప్రక్కను వసించు
అధరాన తేనె తీపారు, వాక్కున సత్య
వాణి విలాస సంపద వహించు
ఆజ్ఞానువర్తన మమలోప దేశంబు
ప్రేమ కస్తూరి పరిమళించుఁ
గన్నులు బెద్దరికంబు సుదోప్పధించుఁ
బొమపు పొందిక లింట ముదియుచుండు

కష్టముల భర్త నోదార్చుఁ గౌఁగిలించి
ఆమె నర్ధాంగిగాఁ గొనినట్టి రాయఁ
డెంత ధన్యుండొ ? పలుమారు సంతసమున
దల్లియును బిడ్డ లెంతటి ధన్యులొక్కొ ?

సరుదుకొనిపోవగ నొక బిడ్డయునుగాదు
లెక్క కేడ్గురు మోయుంగలేని కతన
చెట్టుచెట్టునకును, గుట్టగుట్టకు నొఁగి
పిట్ట పిల్లలమాదిరి పట్టిరడవి.

తల్లిదండ్రు లపుడు తనయుల కష్టాలఁ
గన్నులార నెదుటఁ గాంచలేక
గట్టులేని దుఃఖ కంధి నిమగ్నులై
సరయుచుండి రెంతొ దరులఁజూడ.

వన్యసత్త్వంబు లెవ్వేని వారిదరికి
జేరకుండెను మునులిండ్ల జెప్పరాని
వారినంట దోషంబను పలుకులెపుడు
నాలకించిన కతనఁ గాఁబోలు నిజము.

మిట్టమధ్యాహ్న మయ్యెను మంగలమున
విశ్వధాత్రిని కళపెళ వేపినట్లు
దిశలు దీండ్రించి ప్రక్కలై తెలివిమాని
పొగల సెగలఁ గెంధూళిని బులుముకొనియె.

ఆకురాలిన యొక చిన్ని ప్రాకునీడ
బిడ్డలందఱఁ గూర్చుండబెట్టి కొంత
కాలయాపనపుం బ్రసంగంబుఁ గఱపి
ప్రొద్దుఁబుచ్చెను బడలికపోవు కొఱకు.

కొంత విశ్రాంతిఁ దీరుచుకొనిన పిదప
బ్రాలుమాలిన బిడ్డల బతిమలాడి
బుజ్జగించుచుఁ బయనంబు మొదలువెట్టె
దిక్కుమాలిన మొఱవిను తెరవులేక.

గారడివాని మాయపనిగాఁ గనుపించెడు భూతధాత్రి ని
స్సార మయాత్మకంబని విచారణ మూషను సౌహృదంపు బం
గారము నిగ్గుఁ దేలిచి ప్రకంపిత సంకటపుం దుపాను కం
గారున కేపగింపక వికాస వినిశ్చల ధైర్యసంపదన్.

పడమటి దిగ్వధూప్రణయ భాగ్యసుఖైక మహాభిలాషియై
వడిసెడి తమ్మివిందు పరువంబునఁ దద్గృహసీమఁ జేరె, రా
యఁడు కులకాంతతోఁ గలుఁగు నర్భకబృందము నీడలేక న
ట్టడవిఁ బ్రవేశమయ్యెను నితాంత పరిశ్రమమాన బుద్ధియై.

అంకెలు పెట్టుచుం గవిసి రాతిరికన్నియ స్నిగ్ధపున్ మషీ
పంకము సృష్టికిం బులిమి పన్నిన నల్లని చీరెఁగట్టి యి
ర్వంకల దయ్యపుం బవుజుబారులు లాజల సేనఁ బ్రాలిడన్
బింకపుఁదీవితో వెడలె విశ్వము సర్వము భీతిఁగొల్పగన్.

ఒక నెఱాబున పాపము చకిత మదిని
విసిఁగి యొంటరిగా బిక్కుబిక్కు మనుచు
నావలీవల తలిదండ్రు లనుపుగాఁచి
బిడ్డలను మధ్యనఁ బరుండబెట్టుకొనిరి.

కొఢమ జింకల నెత్తు ఘొదరిండ్ల మదుగును
క్రోలి నిద్రించు వ్యాఘ్రూలగుంపు
సలుగు పందుల, వనస్వాయువు భుజియించి
గవిసి గర్జించు సింగాలమూక
మసలు దుప్పుల మెక్కి విసపు గోరలనూరి
బుసకొట్టు కొండపాముల పడావు
చెదలుదండును గెల్చి మదమున బరిటీలు
గొట్టు యెలుంగుల బిట్టు ఠీవి

కాఱుమబ్బుల కన్నెల గౌఁగిలింత
వలపు స్వాగతమంది దిగ్వళ్లయ వీధు
లబ్బురముసెంది కన్నీట గుబ్బటిలగ
గూబగుమి నిప్పుకల వాన గురియుచుండె.

వేసట్లఁ జెందియుంట, వడి వీచెఁడి చల్లని పైరగాలి యా
యాసముఁదీర్ప, మైమఱుప హాయిగ గమ్మని జోలఁబాడి ని
ద్రాసతి మచ్చుఁజల్లి కనుదమ్ముల బీగములన్ బిగించి యెం
తో సరసాన గ్రుమ్మరుచుఁదోఁచె నినుంగుల సేదదీర్పగన్.

వెను కొకనాఁడు తా ననుభవించిన భోగ విశిష్టజీవితం
బును, తనుబొందు ప్రస్తుతపు ముప్పులఁదావిడి వేసిచూచినం
బొసరగ గాలిలోఁ గలిసిపోయెడి స్వప్నకథా విశేషమై
గనఁబడుచుండునంతఁ గులకాంతను మి త్తివరించె చివ్వునన్.

దగ్గఱకుబోయి కన్నీటిధార గురిసి
యె త్తి పాదిగింటఁ జేరిచి మొత్తుకొనుచుఁ
దన్మయావస్థలోఁబడి త త్తరించు
భ ర్త చిహ్నలఁ గడగంటఁ బడఁతిగాంచి.

కరముల మోడ్పుతో వినయ కారుణదృక్కుల స్వాగతంబు ని
బ్బరమున భ ర్త దుఃఖ పరివ ర్తనగాధకు తావళంబుగా
గురిసి యనంత భ క్తిరసకుల్యము లాతని నామెతింప సా
దరముసఁ బల్కె కట్టకడ దై న్యపువాక్కుల గాద్గదంబునన్.

కాలము దాపరించినది కాటికి కేవల సన్నికర్ష మం
దాలయ మొండుగట్టుకొని యాశలుదక్కితి యెప్పుడున్నదా
జాలము మేనుదాల్పులకు జచ్చుట పుట్టుట సిద్ధమింక, నా
జోలి మనంబునం దిడక సూనులదిక్కు మనంబు ద్రిప్పుమా.

జీవితేశ్వర మన శ్రేష్ఠ జీవితంపు
బుష్పలతికల సుషమా విభూతికలన
త ప్త కాఠిన్య విషలవిత్రలకుఁ జిక్కి
కడకు విచ్ఛిన్నమయ్యెను కాలగతిని.

మరణపుదేవి న్యాయ పరిమాణమెఱుంగని మూర్ఖురాలు దు
ర్భర కఠినాత్మ అక్కట! విభాగమొనర్చెను మీకు నాకు సు
స్థిరమగు ప్రేమబంధములఁ జింత మరొక్కటి జన్మభూమి నా
మరణ సమాధిశయ్యల నమర్చెడి భాగ్యము నోఁచనందునన్.

ఏగి యెటైనగాని యొక యీప్సితమున్ నిను గోరుచుంటి నా
థా! దరిలేని యీ బుడుతలందఱ నీ కరమందుఁ బెట్టితిన్
గాదిలితోడబెంచు మొక కష్టమువచ్చిన నీసహింపకే
నేదరు లక్కటా! తెలివినేరరు దిక్కు మరెవ్వరీవెగా!

ఏనువచ్చిన చోటున కేగుచుంటి
నా కికేమియు దిగులు చింతయును లేదు
గాని మిమ్మెన్ని యాపదల్ గలసికొనునొ?
కాల మెఱుఁగును, భూదేవి గాంచగలదు.

గట్లు చిక్కని మోదకంధిలో మనసార
నాటలాడించిన నాటి ప్రేమ
కడగండ్ల నిప్పుల గాడ్పులో త్యాగంబు
సమకూర్ప మొగ్గిన సహనశక్తి
నిజజాతికొఱకునై నెత్తురు బాటించి
పంతాన బోరిన బంటుతనము
ధర్మార్థమునకునై తనువు వ్రయ్యలుజేసి
యీఁ బూనుకొన్న పేరీవి మహిమ

ఘనతరవిలాస రసతరంగముల నెక్కి
దడిసి బెవరక వీరమాతలకు జెప్పి
మురిసి పొక్కిపోపుచు స్వర్గభూములందు
బాడుకొందు నాధా! నీదు పరమచరిత.

నీవున్నేను మరొక్క జన్మమున నున్నేషప్రభా సంపదల్
దైవాఅంగను నాంధ్రదేశమునసే దాంపత్య బాంధవ్య సం
భావాతీతము ల్లుల్లసిల్లగను జన్మంబెత్తి సంప్రీతితో
దీపింపంగల భాగ్య మెప్పుడొగదా? దేదీప్యమానాకృతిన్.

ఘనతంజెందిన యాంధ్ర వాఙ్మయపు ఢంకాఁగొట్టి మీసంబు ది
ద్దిన శ్రీనాధుని నీ విధేయచరితన్ దెల్లంబుగా వ్రాయుడం
చును ప్రార్థింతును గాని యొక్కనుడి- నీచుండఁచు స్వర్గంబు నం
దున భేదంబది గల్గునేమొ యని జెందున్ భ్రాంతి నా యాత్మకున్.

పలుపుర బందులన్ విడచి భాగ్యవిభూతిని గోలుపోయి కాఁ
పుల బలవద్విరోధమును మూసనుగ్రాగి స్వజాతి దుఃఖమే
యలపునసైన నాపుకొన నాఢ్యుల బాసటలేక కాననం
బులబడి గుందుచుంటిమి ప్రభూత వియోగము తాఁటవింపగన్.

మిత్తి యొత్తిడి కత్తెఱ సత్తి సలిఁగి
దగ్ధమగుచున్న హృదయ పద్మమును నీ వి
చార సూచనోషర్బుధజ్వాలలు ద్విగు
ణీకృతార్తిని గనుమూల్చె నిక్కువముగ.

తీవ్ర సతీవియోగ పితధీకృత సంప్రాప్త దుర్భరైక చిం
తా(వణ మేరుభూధర విదారణ కారణదక్షలాది భా
గ్య వ్రతతిన్ గడించి కడగండ్లకు ధైర్యమునొడ్డి యేక ప
త్నీవ్రతమూను ధీరులకు తేజమదేగద? ధారుణీస్థలిన్.

పసుపుం గుంకుమ గాజుపూసలకు శోభంకూర్చు నీ రూపపున్
వసుధాగోళముఁ బ్రేమచంద్రికల దీవ్యద్ధస్తపుం బాడెపైఁ
బసఁ గల్పించు సువాసినీతనువుతోఁ బ్రస్థానమై స్వర్గపుం
దెసకై పోవుట నాదు జీవితము యెంతే ధన్యమై పోల్చెడిన్.

స్వామి కృపాకటాక్షములు చల్లగవీచిన నెప్పుడైన నీ
భూముల నెట్లొదాటి మన భూములకేగిన, నాదు యస్థులన్
కామకగొంచుపోయి మన కాటితలంబున బాతిపెట్టుచో
దీమసమూని నీ ఋణముదీర్పను నోతును జన్మలెత్తగన్.

ప్రియుని కరమునఁ గరముంచి విడువలేక
కన్నబిడ్డల కరుణ బంగారు నీటఁ
గూర్మి నభిషేకముం జేసి గునిసి గునిసి
తనువుఁ జాలించి స్వర్గంబు దరలిపోయె.

వారి యుపద్రవంబును నివారణఁ జేసెడివారులేక కం
గారు పెనంగ, తల్లి మృతగాత్రము పైఁబడి యేడ్వ గన్నులం
గారు కవోష్ణ బిందువులఁ గ్రాఁగిన గండశిలల్ ద్రవింప బా
గారము జేసిరెట్టులో? యొకానొక దుఃఖ చరిత్రమగ్నులై.

బున దొఱంగిన నరుడు ప్రపూజ్యుఁడైన
నొక నిమేషము గీములో నుంచరనెడి
పలుకునకు సాక్ష్యమనఁ గళేబరము మన్నుఁ
జేసి రా నిశి విధివిధిఁ జెనయునెవఁడు.

సంతతధారగా గురియు సాంద్రపు టశ్రుల దొప్పఁ దోగి యా
వంతయుఁ దాళజాలిని నెపంబున మూల్గుచు గూర్కుఁజెందుచున్
జింతిలి నిద్దురన్ విడచి చీదరబుట్టు నొడళ్ళతోడ ర
వ్వంత సుఖంబులేక తెలవారిచి రెట్టులొ తండ్రి బిడ్డలున్.

ఔడు లంటుకపోయి మాటాడలేక
కాళ్ళ తీపులబాధచేఁ గదలలేక
భార్యపోకడ లాత్మలోఁ బ్రతిఫలింపఁ
బయనమునకు సన్నాహ మేర్పఱచుకొనియె.

మా తల్లియేదని మారాము జేయుచు
నంకెవేయుదు రొక్కయడుగు నిడక
కడుపుజిచ్చున మేము కదలజాలమటంచు
మజిలి జేయుదు రొక్క మార్గమందు
నిఁక యెంత దూరంబు నేగగావలెనంచు
బ్రశ్నింతు రొక్కట పాలుమాలి
మమ్మెత్తుకొనుమని మనవిజేయుచు నాప
సోపాలు బడుచుంద్రు సొక్కి సోలి

కడకు రాయని చిత్తంబు కలతబాఱి
యసురుసురుమంచును నుసురులన్ని ప్రమాను
పడి విచార గుహాలయందుఁ బవ్వఁజుదీఱి
దిక్కుగనక యేకాకినై తేజముఁడిగి.

మానిని దేవతాసతుల మంగళహారతులన్ ఫలంబులన్
గానుకలంది సంతత సుఖంబుల నందుచుఁ గూరుచుండగా
బూనకమైన సంస్కృతి సముద్ర తరంగము లీది యీది యీ
కాననభూమి. నెట్లు కడగాంతునొ? నాకిఁక మార్గమెద్దియో.

అనుచు కడలేని శోకదవానలమున
ధైర్యవర్ష ప్రసక్తిని దరిమి చిన్ని
పాపలందఱఁ గొని దైవబలము కతన
రాజపురికేగె నుంత విశ్రాంతిఁబడయు.

వారలఁ బురజను లారసి
పేరెంబులతోడ వచ్చి పెనఁగుచు మీ దే
యూరని మీ రెవ్వారని
సారెకుఁ బ్రశ్నింప నతి విషాదముతోడన్.

క్రిమి కీటకాద్యుల క్రీడించు మురికి కా
ల్వలచెంత వాసస్థలంబు మాకు
కంకాళములపైని గంతులు వైచు భూ
తములు నిత్యములు మిత్రములు మాకు

ఆరోజు లీరోజులనక వాకిటను మె
లగెడి పెద్దమ్మ బందుగగు మాకు
జీవితకాలంబు చెలఁగి దేహమునమ్మి
జీవించు వృత్తులే సిరులు మాకు

జాంబవంతుని వంశాన జననమొంది
పెద్దయింటివారను పెద్ద పేరు మోసి
మానవేతరమగు నంటరాని పేర
వగచి కృశియించు వెలివాడవార మేము.

వర్షములులేక పంటలు బండలేదు
బ్రతుకజాలక యిటుమేము వచ్చుచుండ
మధ్య మా యాడగూఁతురు మరణమొంది
జివికి మిగిలినవారితోఁ జేరినాను.

అని వచియించు వాక్కు వినినంతనె సీసపుగొండలెన్నొ ఆ
క్కునఁ గఱగించిపోయుగతి గొందల ముంచుచు నిబ్బరింపలే
కను నెవరంతవారలు చికాకయి మోములు తెల్లవోవగన్
జనిరి దరిద్రరాయని విషాదపుగాథను చిత్తగింపకే.

జనకుఁ జెడ్డను బిడ్డలు చాలినంత
కూడుదొరకక యాయూర గొప్పయింట
తనయులందు బుడగని జీతానికుంచి
హేమచంద్రపురంబున కేగిరంత.

కాటి సామీప్యమందు మఖాముజేసి
యన్న మా పురమంతట యడుగుకొనుచు
బిడ్డలందఱఁ బ్రేమాన బెంచుకొనుచు
జీవయాత్రను నెట్టులోఁ జేయుచుండె.

కొండొకరేయి కార్మొగులు కోడెనయస్సుఁ బరాక్రమించి యు
ద్దండతటి త్ప్రభాంగన గతాగతచర్యకు బొంగిపోవుచున్
గుండెలు గుబ్బటిల్లఁ బిడుగుల్ ద్విగుణీకృతమై పడంగ భూ
మండలమెల్ల వర్షమసమానముగాఁ గురియంగఁ జొచ్చెనన్.

కూకటిఁవ్రేళ్ళతో విరిగి క్రుంగి గుభాగుభి గూలుచుండె న
స్తోక మహీరుహ ప్రకరశోభలు తుండెములై, శకుంతముల్
వాకలమూకలై తరఁగ పాన్పులపైఁబడి స్వర్గసీమ కెం
తే కను నీరుచిమ్మ చరుదేరఁదొడంగె భయానకంబుగన్.

ఆ జడివాన దెబ్బలకు నాగగలేక విషాదమొంది ని
ద్రా జపదీక్షయందున విరామములేక సుఖించి మత్తులౌ
లేజవనంపు బిడ్డలనులేపి యొకానొక గోడక్రింది కు
త్తేజముడింగి జేర్చుకొనునె దిక్కు మఱెద్దియు గానుపింపకన్.

నాని నానినగోడ పునాదుతోడ
ధిమి ధిమీయని మిగుల శబ్దించి కూలి
తండ్రియును దుగ్గియును దక్క తక్కువారు
మరణమొందిరి దుష్కాల మహిమకతన.

కొంత తెఱపిచ్చి వర్షమాక్రోశ మణఁగె
కారుమబ్బుల పరదాలు కదలఁబాఱె
చుక్కలు రవంత కాంతితో నక్కినక్కి
వెలుఁగ దొడఁగెను చీఁకటుల్ విచ్చిపోవ.

గోడుగోడున నేడ్చుచు గొణకుకొనుచు
కష్ట వాతావరణ మరికట్టలేక
కటికి కాదంబనీవృత కాళరాత్రి
మందె పేదకుమార్తె సాహాయ్యమంది
ప్రేత భూమికి గొంపోయె పీనుగులను.

తాఁకినయంతలోఁ దనువుఁ గఱ్ఱగజేయఁ
జాలిన చలిగాలి దోలుచుండె
గడియ తీరికలేని తడబాటు దోతెంచు
కుళ్ళుచిన్కుల వాన గురియుచుండె
చేట నిప్పుకణాలు చెఱగుచు భయదంపు
గొరవి దయ్యంబులు దిరుగుచుండె
భస్మ పీఠంబుఁపై బవళించి జగమేలు
బూచుల దొరమంటు రేచుచుండె

వరుడు నక్కలు శవముల మురకబట్టి
గోలఁజేయుచు బొందల గ్రుళ్ళగించి
కసరిపైమూకు గూబల వెస నదల్చి
తనివిదీరంగ పలలంబు దినఁదొడంగె.

జిలిబిలి యస్థిపంజరపు జీర్ణకుటీర కవాటమందు గా
ఢ్పుల గిలిగింతకుం దలఁగిపోక మిణుంగురు బుర్వులంబలే
వెలుఁగుచు రాయుచుండె నొక వేయియుగంబులమించి యాత్మశ
క్తుల బలితంపు దీపికలస్తోమము వింతభయాల గొల్పుచున్.

తీరని జన్మనంపు దొలుచీవుల లంకలు ఘొంగిపోర్ల క
న్నీరు స్రవించి యెదుగలు నెంజిలిరాల్చిన గాజుపూస క్రొం
దేరుల బన్పు కుంకుమము దిబ్బలుదిబ్బలునై తపింపగాఁ
దీరెను ప్రాణనాయకుల తీయని దర్శనభోగవాంఛతో.

ఒకవంక బీషాల నోర్పుతోఁ గొంపోయి
డొక్కులై పాడెలు డొల్లుచుండె
ఒకవంక శవముల వికలమనస్సుతోఁ
గాడులు కన్నీటఁ గాల్పుచుండె
ఒకవంక తలపుట్టె లొడిగి ప్రకృతిదేవి
నాట్యాలమాయకు నవ్వుచుండె
ఒకవంక ప్రాతఁబొమికల గద్దెలనెక్కి
కుక్కలు పరిటీలు గొట్టుచుండె

అస్థికల బూదిరాసుల యంగలార్పు
ప్రాతచరితల కడగండ్ల బలుకరించి
చితుల మూల్గుచు తంగేడు చెట్టులొకట
స్వాగత మిడుచుంచె శవాల బంధుగులకు.

కడకు చేయునదేమియు గానఁబడక
మూల్గు చేడ్చెడి దుగ్గని బుజ్జగించి
ధైర్యమొక కొంత హృదయపాత్రమున రేగ
ప్రతిఫలించెను సూక్ష్మ భావములు గొన్ని.

ఇచ్చోటనేగదా యే మానవుండైన
స్థిర సౌఖ్యములతోడఁ జిందులాడు
ఇచ్చోటనేకదా యే విభేదములేక
సమ ధర్మదేవత సంచరించు
ఇచ్చోటనేగదా యే యంటుదోషంబు
దీండ్రింప లేమికి దిగులుసెందు
ఇచ్చోటనేగదా యే విచారములేక
పరతత్త్వభాగ్యంబు పంటపండు

భౌతిక శరీరమున నడ్డుపద్దులేక
యస్థిర విభూతిఫలముల కాగ్రహించు
నరుల కీశుం డగపడు పుణ్యస్థలంబు
స్వర్గసౌఖ్యాల కిద్ది సోపానపథము.

ప్రతి యామభేద భావముదెల్పు వేఁకువ
కోడిపుంజుల మేలుకొలుపు కూత
శిలలు ద్రవింపగ నెలుగెత్తి మృదు గాన
ములబాడు ఖగదంపతుల రవంబు.

పుష్పాడిదుమ్ములోఁ బొరలాడి ప్రకృతిని
రమియించు పవనాంకురముల దండు
తెలిగంటి పాటలాధరలు సొమ్మసిల మ్రో
గెడు కంచుగంటల నుడులపాట

శ్రాంతి విశ్రాంతి దాంతి ప్రశాంత బోలి
కల నహర్నిశలు సుఖింపఁగలిఁగి ప్రళయ
మంతకును నిద్రఁజెందు ప్రహర్ష మతుల
మేలుకొలుపవు కొంత రమించియైన.

కమ్మని భావచంద్రికలఁ గాసి జగంబు రమింపఁజేయు చి
త్తమ్ములఁ జిక్కుమంచు పరదాల నమర్చి దరిద్రదేవి హ్రా
ద్యమ్మగు నాంతరంగిక మహత్తరశక్తుల నార్పివేసి మో
దమ్మున సంచరించు సరదాలిట సాగవు దొమ్మిజేసినన్.

ఇది కాళిదాస కవీంద్రుని భావామృ
తముఁ గ్రోలి మురిసిన ధన్యభూమి
ఇది కృష్ణరాయల యేపారు కీర్తికి
స్వాగతంబిడిన వజ్రాల నగరు
ఇదియె తిమ్మరుసు మంత్రీంద్రుని దర్శించి
జ్ఞానంబుగొనిన విజ్ఞాన పథము
ఇదెగదా రెడ్డిరాజేంద్రుల యీావి ప
న్నీట మునిఁగిన పున్నెములపంట.

రాయభాస్కర బలి జోగరాణ్ణృపాదు
లస్థికల దర్శనప్రాప్తియగుటకతన
జన్మ సార్థకమయిన ప్రశస్తసీమ
యెట్టివారల కిది గనుసట్టి ఫలము.

పుడమి ముసాపురిన్ గడపి భూరివిషాద కుటీరవాసమున్
విడిచి, గతించి మున్ననిన బీదలు శాశ్వత సౌఖ్యమందుచున్
గుడువ మరేమిలేక యిటకుం జనుదెంచెడివారి నెల్లరన్
బోడఁగని కంటినీటి తెలిముత్తెపు దీవనలిత్తు రోర్చుచున్.

బక్కచిక్కిన పేదవాని కన్నీటిలో
సవతరించెడి నంగలార్పుకీలి
కలుషంపుఁ దనముతోఁ బులిపించు జాడ్యాల
యింతిబింకాల కన్నెఱ్ఱపొగరు
బలుపుమై క్రీడించు కలిమి కన్గొనలఁ
బ్రభవించు మాయల వలపుటుచ్చు
మాత్రలో పలపించి మఱి రోఁతయనిపించు
ప్రకృతి గల్పించు విభ్రాంతి కృతులు

దుఃఖ సంతప్త హృదయ ప్రతోళియందు
బయలుదేరెడి యార్తరవంపు సెగలు
సాగనేరవ యిచ్చోట జపము తపముఁ
గడఁగి జేసిన కొన్ని యుగాలకైన.

మరణ మొకంటయున్నదను మర్మమెఱుంగక భోగభాగ్యముల్
పెరముగడించి మైమఱచి పిల్లికి బిచ్చము పెట్టకుండ దు
ర్భరమతులై సమస్త ధనభావము వ్యర్థము సేయునట్టి కా
పురుష సమాధిశయ్యలిటు మ్రొగ్గుచునున్నవటంచు నెంచెదన్.

కురువింద మణులతోఁ గూర్చిన గొనబు సౌ
ధాల చరించు నిద్రాపథూటి
పునుఁగు కస్తురి గంధములసొంపు రాణింప
హర్షించి కులుకు సౌఖ్యముల రాణి
తీరికవాడల తేరుపై నూరేగు
రవసెల్లఁ గప్పి విశ్రాంతిదేవి
సంతోషవారాశి శయ్యలఁ గ్రీడించు
చక్కందనపు నిరాశాచిరంటి

స్వర్గలోకము సౌఖ్య నైసర్గికపుఁ బ్ర
శస్త రామణీయకము విస్తారమెంతొ
గాని, తర్కింప నీ వల్లకాటి మహిమ
భూతల స్వర్గమేగదా ముదము గూర్ప.

ఇవి యెన్నిదేశాల నేలిన రాజ రా
జుల తలపుఱ్ఱెలై వెలయునొక్కొ
ఇవి యెన్నియుద్ధాల దవిలి గెల్చిన మహా
యోధుల యెముకలై యుండునొక్కొ

ఇవి యెన్ని యిడుములనేని భరించిన
కష్టజీవుల పదగ్రంథులొక్కొ
ఇవి యెన్నఁ డేరికి నింత దానము జేసి
యెఱుఁగని లోభుల శిరములొక్కొ

ఇవి మహోన్నత దేవదేవేశ యజ్ఞ
యాగ కృత్సోమయాజి హస్తాగ్రములొకొ ?
పొంగుటే కాని కాటికిఁబోనివారు
గలరె ? యేనాటికైన జగంబునందు.

పినుఁగు బిగాదిమున్నియలు పేదలు సాదులు పంచభక్ష్యముల్
దినుచు సుఖించి తృప్తిఁగొను ధీరులు, కీర్తిగడించువారు వీ
రసక సమాన శయ్యలిట నందఱికొక్కటిగా సమర్చి నే
ర్చున భువిలేని ధర్మము ప్రబోధముసేయు స్మశానమేగదా ?

అని చింతించుచుఁ బుత్రగాత్రముల సమ్యక్ప్రీతి నాలింగనం
బునుగావించుచుఁ బొంగివచ్చు దుగదంబుల్ వీడి పూర్ధ్వంగ బూ
ను నిమేషంబున అగ్రజన్ము లట కెంతోమంది యేతెంచి వ
ల్లని మీకిచ్చుట తావులేదని బలే దండించి రుగ్రాకృతిన్.

పురిసెడు నేల బిడ్డలను బూడ్చను నక్కట పల్లకాటిలో
దొరకకపోయె, నియ్యది ప్రసుప్తపు టీదఱ గాలివానతో
సుఱిమెడి యర్ధరాత్రము దురూహ్యమునైనను మ్రింగజూచు దు
ర్మరణ విదారసూచక సమస్యను నెట్టుల తప్పుకొందునో ?

భారతభూమిలో వెతల బానిసవృత్తికి చిత్తగించి దు
ర్వార నికృష్టకష్టముల రాపిడివధ్యల దెంపులేని క
న్నీరు స్రవించు పంచములనే కడజాతికి లేదు కాటిలో
దూర రవంత జాగ కట! దుఃఖభరంబులు పూర్వధర్మముల్.

సామరస్య విహీన నిస్సార భరత
ఖండ దుర్వారచరిత విక్రాంతమరసి
దేవుఁడా! యంచు తుదకు ప్రత్యేకభూమి
కరిగె బిడ్డల శవముల బరువుతోడ.

కడకుం బుత్రవియోగసంజనిత దుఃఖధ్వాంతనేపథ్యముల్
సడలింపన్ సుతులార! మీజనని పజ్జన్ శాశ్వతానంద మే
ర్పడ వర్తింపుఁ డఖండ వైభవముతో స్వర్లోకమందంచుఁ దా
గడయాశీస్సు లొసంగి పూడిచెను దుష్కాలంబుఁ జింతించుచున్.

ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

# తృతీయాశ్వాసము

ఆ పురంబున గట్టియ లమ్ముకొనుచు
చాలిపోయినపూట యాచకుఁడు నగుచు
దొరకకుండిననాఁడు తుండుడుకులేక
స్థిర యశఃకాంత మదికి ప్రసిద్ధుఁడయ్యె.

అసలే కాంతవియోగ సంజనిత దుఃఖాక్రాంత నిస్సార రో
దసి గర్భాంతరసీమఁ జిక్కుకొని యాతాయాత జీవాత్మతో
నసి వోనాడెను బిడ్డలేవురొకటన్ స్వర్గీయ భాగ్యంబు నం
దెసనార్జించిరి దుగ్గిదప్ప మఱి వేరేలేదు దిక్కెవ్వరున్.

చలిగాలిజోదులు ములుకులు వర్షించు
    శాటిహీనాంగ రాజ్యంబుపైన
చెమ్మట ముత్యాలు చిందులాడి హసించుఁ
    దనరు సోయగపు సౌధమునుగెలిచి
జఠరాగ్ని క్రొవ్వేఁడి జడివానవర్షించు
    జిగురుప్రేవుల కాంతి జగతిపైన
మురికిచాపల నత్తి ముడియుచు విహరించు
    నారోగ్య దేవిపై నలుకఁబూని

తలమెలుచుకొని యుంటులుగట్టి రేఁగు
విడఁద వెన్నెలతిరుగుంపుల నడుము నిలిచి
నరుని డండులు గొనుచు సన్నాయినూఁద
చేసు దంపతు లూరేఁగుఁ దెసఁగుకొనుచు.

నిద్దురమంపునందు జననీ జననీయని కల్వరించుచున్
బెద్దగ నేడ్చి యట్టిటులుఁ బేరముఁబట్టుడు నంత తండ్రి దా
నద్దిరపాటుఁజెంది తనయా! తనయా! యని దేవులాడుచున్
ముద్దుల దుగ్గి చెత్తుకొని ముచ్చటజెప్పను నూఱడించుచుఁ.

నాలిజచ్చిన సరముల నట్టుసడుమ
నల్లఁ ద్రావుచు మృత్యువు నక్కినిక్కి
పొంచి రోజొకవేష మెత్తించుచుండెఁ
గీడు తనకేమి తాఁ గలిగించినాడొ ?

అతడు మామూలుగా దుర్గమాటవులకు
వంటచెరుకులఁ గొనితెచ్చువాంఛ నరిగి
కట్టియలుఁగొట్ట గొడ్డటిగతి తొలంగి
కాలిపైబడి గాయంబుఁ గలుగఁజేసె.

దిక్కు మఱెవ్వరిన్ గనక తేకువఁజెందుచుఁ గుంటుకుంట తా
నొక్కడె బాటబట్టుకొని యోపిక పెంపున గారు నెత్తురున్
గ్రుక్కలుమ్రిఁగుచు న్దుడుచుకొంచును బిడ్డగతిఁ దలంచుచున్
ముక్కుచు మూల్గుచింటికొక మోస్తరుగా నడదెంచె పోలుచున్.

గీమున కేగుదెంచునరికే మఱిదప్పెను ఘర్మకంకణ
గ్రామము చుట్టుముట్టి పరిరంభణ సౌఖ్యము లాచరించె మా
రామున మిత్తితన్వలచి రమ్మనుచుండెను దృష్టి మాంద్యమై
కామనమంతరించె పలుకన్ దననోటికి మాటరాకయున్.

కనులు మూతలువడిపోయె గంటినీటి
సోన వర్షించె దుగ్గికి సొలయుఁగలిగె
గద్గదస్వర మేర్పడె కాయమంత
కాందిశీకతచే వణకంగఁజొచ్చె.

జనకుని గ్రమ్మిరేగెడి విషాదమరుత్తుల తాడనంబుచే
గనలి కృశించి తెప్పిరిలి కన్నులువిప్పియు ధైర్యమూని చిం
తను విడనాడి కారణవిధంబు గ్రహింపను చిత్తమందు తాఁ
గునియుచు దేహమున్ నెమకి గొడ్డటిదెబ్బగ నెంచి తిన్నగన్.

పైటకొంగున విసరును బలుకరించుఁ
బలుకకుండిన లోలోనఁ బరితపించి
చెలఁగి శైత్యోపచారంబు సేదదీర
నాచరించును నెంతేని యాశతోడ.

తగు సపర్యలొనర్చుచుఁ బొగులు దుగ్గి
దుఃఖగీతికాలాపసందోహరసము
కర్ణరంధ్రంపు తంత్రుల కడకుఁ బ్రాఁక
మేల్కొలుపు పాటలో యన మేలుకొనియె.

చింతిలు దుగ్గిపై సమ్మృత శీతల వాఃకణ వర్షపాతపున్
దొంతరనింపి హస్తమున దువ్వి కచ్చుంగిటఁజేర్చి తాప మా
వంతయు లేనివాసివలెఁ బైకి నటించుచు లోనఁ గుంది తా
నంతిమువార్కులన్ నుడువ యత్నమొనర్చెను కంటినీటితో.

తనయా ! నాకొఱకై యనారతము సంతాపాబ్ధి నిర్లీనమై
దినముల్ పుచ్చకు లిబ్బి తా మసపుటుద్రేకంబుఁ జూపించె దా
ఁన మీయమ్మ గతించె హీనతను వేరేదిక్కు లేకెట్టుల
య్యెను దేశాంతరసీమఁ గాలగతి నిన్నేదారిబట్టించునో,

అప్పులుపోవుచున్ శిశుల కన్నుపుఁ బెట్టపటన్న సామ్యమే
కేవల సిద్ధమయ్యె మనకే యిటువంటివి వచ్చెనంచు నీ
వేపముఁ జెందఁబోకు మన హీనవుజాతుల నెందఱెట్టులో
తాపులులేక చింతిలి వితాకును జెందుచునుండి రెల్లెడన్.

పరరాజులకుఁ దలవంపులుగాఁగ ర
త్నాలఁ జిమ్మిన మేటి దానభూమి
పౌరుష భావనాప్రతిభాధికపుటుగ్గు
పోసిపెంచిన గొప్ప పుణ్యమాత
విజ్ఞానభిక్షను విశ్వధాత్రికి బంచి
సంతసించిన మహా జ్ఞానరాశి
ముల్లోకనాథులు మురిసి యాచనసేయు
బహు ధనంబును గొన్న భాగ్యశాలి

వైరి జనముల రానీకఁ బాఱఁద్రోలి
సేనలోనగుచు గంగాది సింధువులను
సనుగుబిడ్డలఁ గనిన హిమాద్రివెలయు
భరతఖండంబుగద మన వాసభూమి.

వీరులగన్న మాత పృథివీతల సమ్మతితో మెలంగి దో
స్సార విశాల భాగ్యములఁ జాలఁగ జూపిన గన్నతల్లి వి
విద్యారసపూరిత ప్రతిభనంది చరించిన యస్మదాంధ్ర భూ
మీ రమణీయతా మహిమ మెవ్వడు వర్ణనసేయ జాచెడున్.

పౌరుష సంపదన్ బ్రబలి పండిన మేటి యశస్సులోన ము
మ్మారులు హాయిఁజెంది యసమాన పరాక్రమశక్తి యుక్తులం
బోరి జయించి, నిష్కపటబుద్ధిని నాల్గుశతంబు లేలి రీ
భారతవర్ష మాంధ్ర నృపవర్యులు పౌరులు సన్నుతింపగన్.

శాలివాహను ప్రతిష్ఠా జయస్తంభాలు
జేజేల బెదరింపఁజేయునాఁడు
చోళ భూపాలుర శూర ప్రతాపాగ్ని
విశ్వమంతయుఁ గాల్చివేయునాఁడు
కృష్ణరాయల రత్నగేహాలఁ దెనుఁగు ధ
క్కా నిక్వణము బోరు కలఁగునాఁడు
పల్లవాధీశు ప్రాభవకీర్తి చంద్రాత
పద్యుతిదిక్కులఁ బ్రాఁకునాఁడు

ఆంధ్ర జనముల దివ్య తేజోధికంపు
వితత ధాటీ పటిష్ఠైక విలసనంబు
పొంగి పొరలెడి నాఁడున్న భోగమహిమఁ
దలచుచుండిన గుండియల్ జలదరించు.

కాకతీయుల సత్కీర్తి కాంతగన్న
వలపు కానుపు వజ్రాల బాలికలకు
నవ్యతేజోమయంపు కట్నాల నొసఁగి
ఆంధ్రవిష్ణుఁడు కాల్యాణ మాచరించె.

గోదావరీ పుణ్యకుల్యంబు విజ్ఞాన
మధు సస్య రత్న సామగ్రినొసఁగి
పెన్నా స్రవంతి చిప్పిలు వాఙ్మయామృత
శీకరంబుల నెగఁ జిమ్మిచిమ్మి
తుంగభద్రానది తొలకరించిన కైత
వెన్నముద్దల తిండి భిక్షఁబెట్టి
కావేరి మాధురీ గాన సుధానిధిఁ
భరతఖండానికిఁ బంచిపెట్టి

కృష్ణవేణమ్మ సిసలైన కీర్తిఁదెచ్చి
దిశల వెన్నంటి చాటి పందెంబులొడ్డి
ఖ్యాతి వజ్రాల వెన్నెల గద్దెపైన
లోకమేలుచునుండె తెలుంగురాణి.

తురక భూపులు స్వాధీనపఱచుకొన్న
భరతభూమిని రాయలు ప్రభవహించి
తిరిగి యోడించి నంతకు దెనుఁగుదేశ
మనఁ బునాదులేరుపడె సమంజసముగ.

ధన ధాన్యంబుల కిక్కయై యశము సంధానించు నిబ్బారతా
వని కేలాటి యవస్థ గల్గినదొ లాభప్రాప్తి లేకుండఁగా
మన కాలాటి విపత్తు లల్లుకొని అమ్మా! సర్వ సంఘుంబులం
దున నైచ్యంబున గుందుచుంటిమి సిరోదోదూయమానాత్మతన్.

వ్యాసమహర్షి వేదముల నల్లి కులాలకు లేనిపోని యా
యాసముఁ దెచ్చిపెట్టెనని యందు రసత్యము! నిక్కవంబె! తా
రాసికి నాల్గుజాతులని వ్రాసెగదా! మఱి నీచజాతిగా
గాసిలుచున్న యైదవతెగన్ సమకూర్చిన పెద్దలెవ్వరో?

అది యట్లుండఁగనిమ్మిటీవల విపర్యాస ప్రభానీత సం
పదతో మర్త్యులు, దస్యు లార్యులనియున్ భాగంబులై పోవఁగా
సద సద్బుద్ధులనేర్చి యార్యులు సదాచార ప్రహర్షంబునన్
దుద కా దస్యుల నీచులంచు వెలిగా దూరంబునందుంచగఁ.

ఆచారంబులయందు, నాగరికతాన్యాయ ప్రబోధంబులన్
వాచామాధురి గౌరవాభ్యుదయ సంపత్సంఘు విద్యోన్నతిన్
నీచత్వంబు వహించి ధర్మవిధుల న్నేర్వంగఁబోలేక యి
ట్లీ చండాలురనంగఁ జెల్లితిమి యెంతే దుఃఖ నిర్మగ్నదన్.

మనలోమాట నిజాన కీ మనుజవర్గంబందు రెండేగదా?
కనఁగా జాతులు పోతు, పెంటియని కాఁగా లెక్కలేనన్ని యెం
దున సంకల్పితమయ్యె జాతులని యెంతో సంశయంబంది ప్ర
శ్నను గావింతువదేమొ కారణము? నానారీతులై దోచెడిన్.

దినదృత్యాల కొంతంత దీర్చుటకున్నై ధీమంతు లూహించి క్ర
న్నన మూర్ఖాళికి వృత్తిభేదముల విన్యాణింపు టుద్బోధనం
బును గావింపఁ గ్రమక్రమముగఁ గులంబుల్ గూడ సంకల్ప మ
య్యెను గాని, కులభేద మాదిఁ గలదే? యెంచే విమర్శింపఁగన్.

వృత్తులు పెక్కు భంగులు భువిన్ గల వందున గొప్పగొప్ప స
ద్వృత్తులఁ దొమ్మిఁజేసి యవధిన్ గడియించినవారు నైచ్యపున్
వృత్తులఁజేయు గొందర నివేదనఁజేసిరి చేయువారలన్
బొత్తిగ నీచులంచు వెలిఁబుచ్చిరి ధర్మమదెట్టిదో సుతా.

తక్కినజాతులన్ని యొకతట్టున వాసము సేయుచుండి లో
చిక్కిన మాలమాదిగల చీఁకటిగోఁతినిఁ గూలఁద్రోసి న
ట్లుక్కన సంటుదోషపు దురాగ్రహశక్తులతోడ గ్రుమ్మియున్
బెక్కగు నీర్ష్యతోఁ దరిమివేసిరి యూరి బయళ్ళచెంతకున్.

ఏనాఁడో పురిఁబాపినారలదిగా నెన్నో శతాబ్దాలు కా
లానంజిక్కియు గూలిపోయినవి లీలా వైపరీత్యంబుగాఁ
గానీ! హీనుల దిక్కుమ్రొక్కుగని సంగాతాన రక్షింపగా
బూనంబోరుగదా దయానిధులు సంపూర్ణానురాగప్రభన్.

శవ మాంసాదుల నారగించుటను శస్త్రంబంచు తా మొప్పియున్
వ్యవధాశక్తి హితంబు చెప్పిరి దురభ్యాసంపు ఘట్టంబులం
ఉపమానం బొకయింత లేదనియు వ్యాఖ్యానంబు సృష్టించి మా
నవజాలిన్ గడజేర్చినా రధికు లన్యాయాన తోఁబుటులన్.

ఏకార్యాల గడంగిచేసిన నరే యేమద్దియుంచాడకే
యూకొట్టన్ సరిపోయెగాని, దయతో నోదార్చి దుర్మార్గపుం
బోకిళ్యాపరణంబు మానుఁడని యుద్బోధించి సద్వృత్తిచే
నేకీభావముఁ గూర్పనేరరుగదా? యీనాటికైనన్ బుధుల్.

ఆరోగ్యం బది యూవికవాంఘ్రములకు వేపస్పృష్టి వ్యాజంబొ కొం
డారోపించిరి లోకసమ్మతపు పాశ్చాత్య ప్రబోధంబులే
లేలే? సత్ప్రవృత్తి నాచరింపగఁ వారిన్ సన్నికర్షంబునం
దారాలేక సహాసభావ మత సౌఖ్యంబివ్వు ధీరోత్తముల్.

గత జన్మాంతర కర్మభాగమని వర్ణాశ్రమంతు రెంతేని మా
గతియేమంచును ప్రశ్నసేయ సరి జన్మం గారణంబందుమీ
చ్యుత సంస్కారులు సిద్ధయాక్షరులు తద్యోగంబు సర్వత్ర సం
గతమౌనన్న దెలుంగకుంతరును దుష్కాల ప్రభావంబునన్.

వసులనుబట్టియే మనుజవర్గమునందున నీచ గౌరవం
బసగను రెండు ముఖ్యమగు పార్శ్వలు గల్గెను, పుట్టి నీచపుం
బనులఁ బరిత్యజించి గరిమన్ ముఖ్యమౌగుచునున్న హీనులం
చనెడి విరుద్ధబుద్ధి యొకఁ దుష్టమునుండియు రాఁదొడంగెడిన్.

భూములుదేవ్వ గల్గినను బొత్తిగఁ బందవు, లచ్చియున్ననో
గీములఁ దొంగిమూడదు వకీళ్ళనుబెట్టి సహాళ్ళవేసినన్
ప్రేముడిదో శనిప్రభుఁడు వెంగలిసిద్ధికి నష్టజాడుగా
భూములఁగూర్చు గొన్ని పగఁబట్టిన పన్నుగదా జమా యనన్.

విను మొక ధర్మసూత్రము వివేకమతీ! మనలో రమారమిం
పొనరఁ పదైదుకోట్ల జనముల్ గలరందురు, మేలదృష్ట రే
ఖను గలవాఁ డొకండయిన క్ష్మాతలమందున బుట్టడయ్యె వం
తునకయినం బదుంద్రీపతెఁ దోయజ జన్ముని ధర్మమెట్టిదో.

[illegible]యగ భాగ్య విద్యలను నంది విశాల సుఖానుభూతి వి
స్ఫారయశస్స్ఫుతోఁ బెరిఁగి భారతభూమిని పూలమూడిగల్
గూరిమితో మెలంగుటను గొప్పకులంబులవారి కండ్లలోఁ
[illegible]పము వోసినట్లగును గాంచుకొలందిగ వృద్ధిఁ గోరమిన్.

ఏకీభావములేక సద్గతికి తావేలేదు దుర్వార ని
[illegible]కానీక జగంబు గర్భమున నిర్లీనంబునై దాస్యమం
దాకల్పంబు నడంగియున్న మన కన్యాయంబుఁ గల్పించు చిం
తాకాలుష్యము లంతరింపవుకదా! ధాత్రీస్థలంబుండగన్.

మన హస్తకమలమం దణఁగియున్నది తెలుం
    గుల జాతకము వ్రాయ గొనబుకలము
మన నెత్తుటూటయం దినికియున్నది రాజు
    లకు జయంబిచ్చు వాలముల సమితి
మన ధర్మబుద్ధిలోఁ దనరియున్నది వదా
    న్యుల సాహసోద్రేక యోగపటిమ
మన త్యాగమహిమయం దఁణగియున్నది దేశ
    భక్తులు వెలుఁబుచ్చు పరమశాంతి

మన ప్రశస్త వితత ఘర్మకణములందు
ప్రతిఫలించెడి దోశ్శక్తి భాసురంబు
భావి భాగ్యోదయంబునై భరతభూమి
సిరుల సేకూర్చి మిన్నయై చెలఁగుచుండె.

పురుషాంతంబులు దాటిపోయినకతంబున్ భారతక్షోణిలో
బరవంజెందుద కంటుజాడ్య విష దుర్వారోగ్ర వృక్షంబు వి
స్తరశాఖా ఫలపుష్పపత్రముల సంతాన ప్రభానీత దు
ర్భరమై చెన్నలరంగ ఖండన మొనర్పన్ రాదె జ్ఞానాసిచేన్.

నరశత్రువై పుట్టనడుమ నిప్పులుఁ గ్రక్కు
విసపు నాగులు గుంది బుసలుమాను
స్పర్శనజ్ఞాన సంభ్రమములేని శిలాళి
చలియించి ద్రవియించి కలఁతజెందు
మనుజ వాసనఁబాఱఁ గినిసి గర్జించు ము
వ్వన్నెమెకము రోషభరత నుఱుకు
ప్రకృతి కాంతామణి పసదనంబు హసించు
పసరుటాకులు మూర్ఛ భావమొందు

ఆదిమాంధ్రుని నెమ్మోనునంటి భువన
మున కసహ్యతా పరిమితిఁ బొడమఁజేయు
నంటురోగపు నిట్టూర్పు లలమికొన్న
మాత్రలో శిలీభూతమై మతులుదప్పి.

నిలువన్నీడ, వసింప జాగ, తిన పానీయంపుటాహారపుం
గలనం బెంతయు లేని జాతియని సత్కారాన మన్నించి వి
ద్యలఁ జెప్పించిర! కొల్వులిచ్చిర! మతేతద్రాజకీయంబునన్
గలనైనన్ గననోచకుంటిమిగదా క్ష్మానాథు సాహాయ్యముల్.

ఎక్కడ సీమయందొ జనియించి వసించెడి హూణరాజు మా
దిక్కు గనంగలేదనియు తేపకుతేపకు నేడ్వకుంటె ప్రా
ద్దెక్కినదాది రక్తపు రసేక్షువు బీల్చెడి యగ్రజాతు లిం
కెక్కడ దాగినారు మనకేగతి జూపని నిర్దయాత్ములై.

అమెరిక దేశవాసులు మహాత్ములు కొందఱు క్రీస్తు సిల్వపై
న మరణమొందఁ జిందిన నసర్గళ రక్త మహాప్రవాహమం
దు మునిఁగి త్యాగశీలురయి దొడ్డగఁ జేసిన దైవసేవ నీ
చమతుల బాగుఁజేసెను విషాద పరంపర లంతరింపగన్.

జనకు గన్నుల గురియు బాష్పాల దుడుచు
చడిగె నిట్టూర్పు జెందుచు నార్తిబొడమ
మనల రక్షించి ముదమూర మనపునట్టి
దాతలెవ్వరు గలుఁగలేదా మరేమి?

కలుఁగక యేమి పుత్రిక! యొకానొక సామెత భారతోర్విలో
శిలలు ద్రవించి దానమును జేయుసటంచును రాణజెంది భూ
వలయమునిండెఁ దద్యశము భారతభామిని మోదభాష్పముల్
గులికి స్రవింపగా దిశలు కూరిమి యుయ్యెల లూగుచుండగన్.

భారతదేశమందు గల బాధ్యతలన్నిట వెన్కజిక్కి యు
న్నారని నిన్న మొన్నట సనాతన ధర్మ వివర్జితుండునౌ
పూరుషుఁడొక్కరుండు మన పుణ్యభువిన్ జనియించి గాంధియన్
పేరున బోరుచుండె జయభేరులు మ్రోతజ గాలునిండగన్.

ఆమ్మహాత్ముని యుద్బోధ మాచరింపఁ
పరమభక్తులు కొందఱు బయలుదేఱి
త్యాగము వెలార్చుచున్నారు ధరఁబొసఁగ
రక్తపుం గాన్కలన్ సమర్పణముసేసి.

వీరనాయికవై సుంత విసువుఁగొనక
మన కులోద్ధరణకయి సమస్త రాష్ట్ర
ములఁ జరించి పోరాడు ప్రపూజ్యనగర
సీమలను వీలుపడిన వీక్షించుచమ్మ.

ఒక మహాత్ముడు మన నాట నుద్భవించి
హరిజనోద్ధరణార్థమై యసువులొడ్డి
విశ్వదాతయనఁగ బొంటె బిరుదు, కాశి
నాథ నాగేశరాయఁ డనంతదృష్టి.

తెలుఁగు గడ్డకు పన్నెఁ గలిగించి భాషోష
ధులఁబోసి పెంచు మాధుర్యరాశి
ప్రాపంచకముతోడ బందెంబులొడ్డి ర
త్నాలఁ జిమ్మిన మేటి దానశీల

శ్రీరామునకుఁ దారిజెప్పి పున్నెముఁగొని
పేరుమోసిన పెద్ద పేరటాలు
రాయలంతటి మహారాణివీరుఁ బ్రేమించి
వియ్యంబులందిన వీరమాత

ముసలితనమున సంసారమును త్యజించి
పెత్తనములేక నిచ్చలు పేదవడియు
కుములుచును దెప్పరిలు వినుకొండపురిని
దర్శనము సేయు కన్నీటిధారనాపి.

అరగలేదు భాస్కర మహాప్రభు దానసుధాస్రవంతు లిం
పారఁ దదన్వవాయోద్భవ నితాంత గుణోన్నత భాసురుండు వి
ద్యారసపూరితుండును, సుదారుఁడు రాఘవ సౌహృదంబులో
నీరికలెత్తి పొంగి జవుకెత్తగఁజొచ్చెఁ దెనుంగు భూములన్.

చేకుఱుబన్న మాపుటకు శీర్షమునొడ్డి స్వజాతి వ్యాజ్యెపుం
బోకడలందునిగ్గి పాలిపోవని కీర్తిఁ దెనుంగు దేశమున్
వీకఁ జొరంగజేసి జయభేరిని మ్రోసిన బీరినీడి మో
షే కవిసార్వభౌము నభిషేకముఁ బొందుమ శాశ్వతంబుగన్.

అర్థుల ప్రార్థన నిత్యము
వ్యర్థముగాకుండ మేటి వరములనిడి ప్ర
త్యర్థుల కగోచరంబయి
వర్ధిలు గద్వాల కరుగు ప్రభు దర్శింపన్.

కులుకుం బూతపసిండి గద్దియపయిన్ గ్రొంగ్రొత్త తేజంబుతో
గొలువుందీరి శనైశ్చరక్రియలకు కాక్రోశించి దర్బారులో
పల మోదంబున దాన ఘంటికల శబ్దస్తోమముల్ మ్రోసి భూ
తలమున్ బాసిన రాజచంద్రమణి సీతారాము ధ్యానింపుమా.

అది లక్ష్యంబయినంగ నయ్యధిపు మహిషి
ఖ్యాతి వజ్రాల నేటేటఁ గాన్కలిడుచు
బీదలను సత్కవీంద్రులఁ బెంచుచుండు
నమ్మహారాణి దర్శన మపరంబు.

ఒకనాఁడు విద్యుజ్జ్యోచిత దర్శనో
త్సుకత డోలికలపైఁ బ్రముళ్ళతూఁగి
ఒకనాఁడు సత్కవి ప్రకరవాగమృతాబ్ధి
యలల శిబికల పర్యటనజేసి
ఒకనాఁడు రాతేని నికష్ర కీరితి కన్నె
స్తోత్రాభిషేకాన దొప్పదోఁగి
ఒకనాఁడు మంగళ ప్రకట ప్రశాంత ని
నాద విభూతి కానందమొంది

భూతల స్వర్గమో యన ముదముఁగూర్చి
ఖండఖండాంతర ఖ్యాతిఁగాంచి జీర్ణ
మై మిగిలిన హంపిక్షేత్ర మరసిపొమ్ము
కృష్ణరాయల ప్రతిభను గీర్తిజేసి.

ఆ నరపాలుఁ డెట్టిగడియన్ జనియించి శిరంబునెత్తెనో
గాని తనంతఁ దానెయయి కత్తిని వీడెడినంతదాక త
న్నే నరనాథుఁడేనియు జయింప యెఱుంగడు పేరు విన్నమా
త్రాన వణంకి భీతిలి పరారయి దాగిరి కొండలోయలన్.

ఆదె తెలుంగులయుగం బతులిత వైభవా
భ్యుదయము నార్జించి మురియుకొఱకు
ఆదె యాంధ్రులయుగంబు యశము వజ్రములేరి
కొట్లలో గొలిపించు కొనుటకొఱకు
ఆదె తెలుంగుల యుగమఖిల దేశాల శౌ
ర్య పతాకమెత్తి పరాక్రమింప
ఆదె యాంధ్రకవుల మహాయుగమెందు భా
షాక్షీరములఁ గ్రోలి సంతసింప

పట్టినదియెల్ల బంగారు ప్రతిమలగుచు
కులుకునవ్వుల పుపుగద్దెఁ గొలువుఁదీఱి
మీసముల గోటదిద్దిన మేల్మియుగము
వెడలిపోయెను కృష్ణ భూవిభునితోడ.

స్థిర సత్కావ్య విశాల హర్మ్యముల నుద్దీపించి భాషావనుం
ధర నిర్మించి సుభావదీపికల సంధానించి సంతోషమే
దుర డోలాళుల హాయిగ మురిసెడిన్ దుర్భాక శ్రీ రాజశే
ఖర విద్వత్కవిసార్వభౌముని యశఃకాంతామణిన్ జూడుమా.

కవితా సరస్వతీకవి సార్వభౌమాది బిరుదముల్
గల కవి వీరమౌళి
విశ్వప్రశస్త పవిత్ర వీరవరేణ్య రాణాప్ర
తాప సద్గ్రంథకర్త!
దేశభక్తిస్ఫూర్తి దీక్షతోఁ దనము సుద్యో
గంబువదలిన పెద్దవాఁడు!
ఆల కళాపరిషత్తు హాటక వజ్రకోటీర
మర్పించిన వీరసుకవి!

బహుళ రసవత్కృతుల వ్రాయు బ్రహ్మమౌని
సూర్యవంశ మహాకవి సోముఁ డనగ
దనరు మా రాజశేఖర ధన్యమూర్తి
దర్శనమొకంట గావింపు దప్పకుండ.

తనదు సాయంబునొందని సంస్థ దేశమం
దొకఁడైనఁలేని మహోపకారి
కవిసార్వభౌమ సత్కవులకు స్వర్ణ కో
టీరంబులొసఁగు నుదాత్తచిత్తుఁ
వడగరేగాని తన్నడిగిన సర్వస్వ
మైన నిచ్చెడు వదాన్యప్రభుండు
ననలోపములు వైశ్యజనుల నింతటి దొడ్డ
వారు లేడను కీర్తివరలు ఘనుఁడు

కవుల విబుధుల, నర్ధుల మివుల ప్రేమ
నూని పోషించుచో నెమ్మిలేనిచేయి
వీరిదని పేరువడసె చుండూరు వంశ
విధుఁడు వేంకటరెడ్డిని వేడ్కఁగనుము.

మన నాగేశ్వరుమాఱు దానగుణ సంపన్నుంపు సింహాసనం
బునఁ గూర్చుండి నిసర్గ హేమమకుటంబున్ దాల్చుచున్ పేదలౌ
జనులన్ బ్రోవ ధనంబొసంగు ఘనుఁ డా జవ్వాజి లక్ష్మయ్య పా
వన సంస్థానముగాంచుమొక్కటి మనఃపద్మంబు రంజిల్లగన్.

కల్లూరి సుబ్రాయ కళ్యాణకీర్తిని
బంగారుపూళ్లతో భజనజేసి
రొద్దము రాజయ్య పెద్దరికంబును
వజ్రాలమాలతో ప్రస్తుతించి
అశ్వత్థ నారాయణాఖ్యు ప్రభావంబు
పన్నీటి జల్లుతో పలుకరించి
కోటిరెడ్డి సచివ కోవిదు త్యాగంబు
క్రొంజాజిపూలతో కొలువుదీర్చి

ప్రతితదుర్భాక కృష్ణ విద్వత్కవీంద్రు
ఘనతఁగొలిచి చిత్తూరు నాగయ్య గాన
రససుధాస్రవంతులయందు రాణజెందు
తెలుగుగీర్తిని చరితల బలుకరించి.

అఖిలభారత చర్మకారాది సభల
కాధిపత్య ప్రసూనంపు హారమందె
వితత సత్కీర్తి వీధుల విఱ్ఱవీగు
పండితాఖండులుండు పరపస్తుదాసు
యభినవాశీస్సు భాగ్యంబు లందుకొమ్ము.

తేటతెలుఁగు నీటి తెలితేనియబాటెవి పెన్న గట్టుపై
నీటుగ గొల్వుదీరి గణనీయ కవిత్వ ప్రశస్తిశోభ ము
హ్యాటలు హాయిఁజెందిన ప్రసన్నకవీంద్రుడు తిక్కన పల్కు బోటితో
నాటలనాడి భారతము నల్లిన సింహపురంబుఁ జూడుమా.

కను మచ్చోట సుతా! వదాన్యగుణావికాసుండు నిర్భాగ్యులన్
గని రక్షింప ప్రశాంతపుం జపము గాంక్షించేసి యచ్చంపు కీ
ర్తినిగాంచెన్ బెజవాడ వంశభవుఁడై శ్రీరామచంద్ర ప్రభుం
డన ఖండాంతర సీమలందు బహుళాసందాన ప్రార్థింపుమా.

తన యోజనా మగ్నతను జూపు ధీరత
శనిదేవు హృదిఁదాకు శరముపోటు
తన హర్ష పరవశత్వముఁ జూపు లేనవ్వు
తెనుఁగు రాణి ముకుటమునకు వన్నె
తన కరుణారసత్వముఁ జూపు చిత్తంబు
సిలుగులు సెందు బీదలకు ఫలము
తన మహత్తర దీక్షతను జూపు సంసేవ
లాంధ్ర జనాభ్యుదయానికండ
తన మహాద్భుత వితత మేధావిశేష
పరిణత శ్రీ మహారాజ్యగరిమఁ బెంప

నఖిల జన వర్ణనీయుఁడై యసముగాంచె
నమ్మహాత్ముని దర్శన మాచరింపు.

అస్పృశ్యతా జాడ్య మంతరింప నితాంత
విక్లాంతములఁ బొందు వీరవరుఁడు
హరిజనోద్ధరణార్థమసువు లర్పింపను
ఉంకొని పోరాడు త్యాగమూర్తి
సత్కవీంద్రాళి వాచా మాధురి గ్రసించి
పసిఁడి కాన్కలిడెడు ప్రభువరుండు
తన గడ్డ బానిసత్వముఁ దొలగింప రు
ధిరము నొసఁగుచున్న ధీవరుండు

పరుల కష్టాలఁ గన్నార పరికరించి
కంటనీరులు రాల్చెడి ఘనచరిత్రు
ప్రథిత రేబాల పట్టాభిరామరెడ్డి
దర్శన శుభంబు నీకు యత్యవసరంబు.

సరివేపలి వంశోద్భవు
దరయగ విజ్ఞానపూర్ణుఁ డతులితకీర్తిన్
పరలెడు రాధాకృష్ణున్
మరువక దర్శించిపొమ్ము మానితభక్తిన్.

తన మనోజృంభిత దాతృత్వజలధిలో
స్నానంబులాడె యాచకులనొక్క
తన మహావిమల మేధాశక్తి కాంతిలో
జిగురుపట్టెను శుద్ధచిద్విభూతి

తన యుపన్యాస విద్యాప్రబోధోర్వులో
　　　　తృప్తిఁజెందెను హూణదేశమంత
తన శాంతికరుణాప్రధాన పాలనము న
　　　　ర్థించె రాజేఁడు కీరితి పడంతి

తన కుశాగ్ర బుద్ధీంద్రియ ఖనుల వెడలు
జ్ఞాన రత్నాల దేశదేశాల బంచి
తెల్గు నేలకు వన్నెను తెచ్చినాడు
నమ్మహాముహు దర్శన మభిలషింపు.

కీరితి కన్నె లేఁతపస కీల్జడఁ గ్రుచ్చిన చంపకాల సిం
గారపు జాళువా పసిఁడిగద్దె శిరంబునఁ గొల్వుఁదీఱి, పొం
గారు ముదంబు నర్థుల హృదంత మెఱింగియుఁ బంచుచున్న దు
ర్వారుడు తూములూరి శివరామువదాన్యుని ప్రజ్ఞ జాటుమా.

సద్గుణోన్నత నైజ భాస్వచ్చరిత్రుఁ
డార్తజన రక్షణపు బిరుదాంచితుండు
పండితాఖండలుడు ధీరవరుడు భట్టి
ప్రోలు సూర్యప్రకాశ ప్రభుని దలంచు.

తన ఖడ్గధాటి కాంధ్ర యశోరమామణి
　　　　యర్పించె తెలిము త్తియముల కాన్క
తన విక్రమస్థిరతకుఁ బొంగి జయలక్ష్మి
　　　　దయచేసె పట్టు జల్తారుపాగ
తన వదాన్యత కుబ్బి తనరి భారతమాత
　　　　గురియించె రతనాల క్రొత్తవాన

తన మహోన్నతికి స్వాంతము చిగిర్చి ప్రకృతి
యనిపె నివ్వాళి గంధాక్షతలను

విశ్వరంగంబుపై బొమ్మ విఱచి నిలచి
కత్తిఝుళిపించి వార్ధుల కలతపఱచి
తెలుఁగుతల్లికి మోదంబు తొలకరింప
కీర్తి నార్జించినాడు దిగ్దేశములను.

పాయక విశ్వనాథకుల పావనమూర్తి దయాళు సత్యనా
రాయణ సత్కవీంద్రుని ఘరానగ దర్శన మాచరించి నీ
కేయది యీప్సితంబొ యది యేమియు జంకక వేడుకొమ్ము నీ
కాయన చేతనైనవఱ కడ్డముఁజెప్పడు చేయుదానికిన్.

తెలుఁగు నెత్తురుఁబోసి తేజంబు వెలిగించి
కండరాలకు యుద్ధ కథలఁ జెప్పి
తెలుఁగు మాటల తేతెతీపిని జుబికించి
జ్ఞానశక్తికిఁ గమనంబు సెప్పి
తెలుఁగు టుగ్గునుబోసి కులికించి, తనువుకు
దేశాభిమానంబుఁ దెలియఁజెప్పి
తెలుఁగు దాన జలంపుతేటను ద్రావించి
మదికి వదాన్యతా మహిమఁజెప్పి

ఆంధ్ర జనయిత్రి బ్రహ్మాండమైన ప్రేమఁ
దెలుఁగు బయల నూరేగించి తేజమొసఁగి
తనకు కవిరాజ బిరుదప్రధాన గరిమ
మన్ననముఁజేసె నాంధ్ర సామ్రాజ్యమందు.

ఆనంద జనిత నవ్య కవిత్వంపువార్ధి వీ
చి డింభకులతోడఁ జెలిమిఁజేసి
దేశీయపదముల దీయందనంపు కమ్మ
పుప్పొడి దుమ్ములోఁ బొరలియాడి
పస నిగ్గుజగ్గుల భావాధికపు పూల
మెత్తని సెజ్జపై మేనువాల్చి
కులికించి బసవెత్తు గ్రొంగ్రొత్త నడకల
తొలుకారు మెఱుపులతోవసించి

అగ్రగణ్యత నార్జించి యాంధ్ర వాఙ్మ
యంపు సింహపీఠికపయి నధివసించి
ప్రతిభఁ గాంచిన తనదు కబ్బపుఁ బసంతి
దర్శన మొనర్చు మొకసారి దప్పకుండ.

మన దౌర్భాగ్యముఁ దప్పఁద్రోయుమని సమ్యక్ప్రతి రత్నాది చం
దన గంధాక్షతలిచ్చి ముష్టులకు బ్రాణంబొడ్డి నిష్పచ్చరం
బును బ్రార్థించుచు త్యాగమూర్తియయి సంపూర్ణాత్మ నర్పించి మిం
చిన శ్రీ గూడూరి రామచంద్రవిభు సచ్ఛ్రేయంబు సర్థింపుమా.

ప్రథిత వేంకటాద్ర్యప్ప భూపాలపముని
దర్శనము సేయు సిలుగులు తారసిలిన
సన్మహాత్ముఁడంటి దివ్యస్వరూపి
కానరాడెందు భవదీయ కాంక్షఁదీర్ప.

నాగేశరాయు విజ్ఞానంపువ మధువుల్
ప్రతిఫలించిన పండువంటి మనసు

భోజరాజేంద్ర ప్రబోధామృతపుటేరు
కులికి మోసెత్తిన కోవిదుండు
కృష్ణరాయల మహాకీర్తి శౌర్యములతో
వియ్యంబులందిన వీరవరుఁడు
రఘునాథ రాజేంద్ర రసికతాబ్ధిని దాన
రత్నాలనేరిన ప్రథితయశుఁడు

ఆ మ్మహాత్ముని సంస్థానసమర్థిజనము
ఇసుకజల్లిన రాలక నిసలు పవలు
మూఁగియుందురు నీ వటబోయి వేడఁ
గూర్మి నభిషేకమును సేయుఁ గొఱఁతలేక.

జయపుర మేగు దూరమని జంకక మార్గ మగమ్యగోచరం
బయిన మహాటవీతతి, భయంకర శైల నికుంజ నిర్ఝరీ
మయమయి, పక్షిదంపతి సమర్పిత కూజిత నాట్య గీతికా
ధ్యయనమునై తనర్చు కనులారఁగఁగాంచుము శీఘ్రమే సుతా!

ఆ పురమేలు సద్గుణ విహారుఁడు విక్రమదేవవర్మ భూ
మీపతి సత్కవీంద్రులకు మించిన కానుకలిచ్చు నర్థి సం
తాపపుటగ్ని నార్పను సతంబు విచారమొనర్చుచుండు నీ
వా ప్రభు దర్శనోత్సుకము నందిన శాశ్వత ధన్యవే సుతా!

వాతెఱవిచ్చినన్ మధురవాక్కుల వర్షము, చూపులందు ని
ర్హేతుకమైన ప్రేమ, గగురింపుల నవ్వు, హితానుగుణ్యముం
బూతపసిండి పళ్ళె బొలుపుం బ్రసరించు ముఖారవింద వి
స్ఫీత వినిర్మలాత్మయును విక్రమభూపతి నగ్గలంబుగున్.

కాలవశాన సీత నిజకాంతుని బాసిన బెట్టిదంపు దుః
ఖాలను మూటఁగట్టి కడగండ్ల గడించిన కాన పైఁడి చూ
లాలుఁ గాంచుచాపయి పరాసరి దాపున కొండపల్లి గో
పాల దయాస్వరూపుని దివాణముచేరుమ నిర్భయంబునన్.

అమ్మహాత్ముని హృదయంబున దొణుకాడు
కరుణాభిషేకంబు మురువుదాల్చి
అమ్మహాధీరు దృగంచలాలు స్రవించు
వీక్షణ పీయూష వృష్టిఁ దోఁగి
అమ్మహారాజేంద్రు హస్తాలు గురియించు
బంగారు జల్లులఁ బవ్వళించి
అమ్మహాదాత సత్యాలాపము వెలార్చు
శాంతి మకుటము శీర్షమునదాల్చి

ఘనతరానంద రసతరంగముల దూఁగి
అర్థిజనములు సౌఖ్యప్రవర్ధమాను
లగుచుఁ బెంపొందుచున్నారు దిగులుబాసి
యమ్మహాత్ముని జూచి మాటాడిపొమ్ము.

ధీరుఁ డుదార నైజగుణదీప్తుడు సత్కవిపోషకుండు త
న్నారసి మ్రొక్కు పేదల సమంచిత నిస్తుల కామితార్థ సం
భార పరంపరల్ గురియ మానిత మార్దవచిత్తమూను కా
ళ్ళూరి యుమామహేశ విభులోగిట కేగుమ సంతసంబునన్.

అమ్మహాదానశీలున కన్నగారు
వర వదాన్యుఁడు బ్రహ్మాండ భాండమంత

కీర్తిగంధంబు నింపిన కిషనుభూపుఁ
బుణ్య సంస్థాన మరయఁగఁ బొమ్మ బిడ్డ.

కవితాలోకము సంస్మరింపగల సత్కావ్యాల వ్రాయించి ప్రా
భవమొప్పన్ గృతిఁబొంది తత్కవులు సంభావించు నాశీస్సులన్
భువినార్జించి యశోరమామణికిఁ బూవుంగుత్తులర్పించు సం
స్తవనీయుండగు రామకృష్ణవిభుఁ బాదాబ్జాల సేవింపుమా.

హరి రామలింగశాస్త్రిని
మరువక దర్శింపవలె గుమారీ! విద్యా
భరితుండాయన హరిజన
పరములఁ దీర్పంగ మేటి ప్రాపకుఁడుసుమీ.

కమ్మనికైత కప్పురపు గాడ్పుపటాణుల గొల్వుదీఱి మో
దమ్ము చిగిర్ప కీర్తి వనితామణి నిస్తులశస్తగంధతో
యమ్ముల హారతిన్ మునిఁగి యభ్యుదయంబున స్వారిఁజేసి దే
శమ్మునఁ బేరుమోసిన ప్రశస్తగుణాఢ్యుడు నిక్కువంబుగన్.

ధీరుఁడు దేశభక్తుఁడు విధేయుఁడు సత్కవిశేఖరుండు వి
ద్యారసపూరిత ప్రతిభనంది చరించెడి జ్ఞానవేత్త క
న్నీరులరాల్చి బీదల వినిశ్చలబుద్ధిని ప్రోచుదాత స
ద్వీరవరుండు కోటగిరి వేంకట కృష్ణవిభున్ దలంచుమా.

కట్టమంచి కులీనుఁడు కవివరుండు
బహుళ మేధావి విజ్ఞానవార్ధి యతి ద
యాళు రామలింగారెడ్డి యధిపు చెంత
విన్నవింపుము మామక విప్లవముల.

తెలుఁగు జెండానెత్తి దేశదేశంబుల
గెలుపు కాంతలగొన్న వలపుకాడు
తెలుఁగు విజ్ఞానంపు దివిటీల వెలిగించి
ప్రతిభ చాటించిన పండితుండు
తెలుఁగు మేధాశక్తి ధీరత్వమునుజూపి
చరితలో మున్గిన సాంద్రయశుఁడు
తెలుఁగు కవనముతోఁగల దేశములమీద
పందెంబులొడ్డిన పంతగాడు

శౌర్య విఖ్యాతి భిక్షల జగతికొసఁగి
ఆంధ్ర విశ్వవిద్యాల యాధ్యక్షపదవిఁ
బ్రబల రామలింగారెడ్డి ప్రభువరేణ్యు
బుణ్యసంస్థాన మరయుగాబొమ్ము తల్లి.

సుకుమారుల్ గవి చక్రవర్తులుఁ జగచ్ఛోభాయమాన ప్రభా
వ కవీంద్రుల్ సుగుణాఢ్యశేఖరులు విద్వద్వర్య సంస్తుత్యులుం
బ్రకటింపంగల కొప్రపుంగవుల దివ్యాట్టహాసప్రాప్తిచే
సకలాశీర్వచనంబులం బడసి హర్షంబంది పొమ్మో సుతా.

సభలెల్లన్ జయవెట్టి మెచ్చుకొన హాస్యాపార సారాంశ వా
క్ప్రభ సాగించుచుఁ బైడిగుప్పిట కవీంద్ర వ్రాతమున్ దన్ని కీ
ర్తి భరంబుఁ దలకెత్తుకొన్న కవిరాడ్దిగ్దంతి సత్పాండితీ
విభు బందాకుల చంద్రుఁ జూచి మఱి పోవే! సూర్యనారాయణున్.

ఆధునిక కవిత్వంపు హర్మ్యము లమర్చి
భావదీపికకాంతుల ప్రజ్వలించి
ఆయతయశంపు తూగు టుయ్యాలలూఁగు
రాయప్రోలు సుబ్బకవి వరాలబొందు.

కాలవాహిని మాయభంగములఁ జిక్కి
చరితలో మిన్గి కన్నీరు గురియుచున్న
కొండవీఢ్వరి రెడ్ల యుద్దండదుర్గ
సీమ నవలోకనంబును జేసిపొమ్ము.

తెలుగుందల్లి కనుంగు బుత్రులయి యుద్దీపించి భాషాబ్ధిలో
పల శ్రీనాథ మహాకవీంద్రు కవితా ప్రాశస్త్యభావంపు టు
య్యేలలన్ దూఁగి ప్రభావిరాజితులునై యేపారి భూలోకముఁ
బులిపింపంగల రెడ్డి భూపుల యశంబుల్ శాశ్వతానందముల్.

వారి వదాన్యతామహిమ, వారి విశాలగుణానురక్తి సం
భార పరంపరల్ జికిలిపట్టిన వేమన పద్దియాలుగా
మారి ప్రశాంతమై కవి కుమారుల వాక్కుల వీణెలందు నిం
పార బవిత్రమయ్యెను దిగంగన శాశ్వత మోదమందగన్.

శాంతి సామ్రాజ్యంబు స్థాపించి వెడలిన
గద్వాల భూపుని గద్దెయందు
రసికుండు బెజవాడ రామచంద్రారెడ్డి
ప్రభువరేణ్యుని తలపాగయందు

స్థిరుడు తిమ్మారెడ్డి ధీశాలి గురియించు
చల్లందనపు వీక్షణములందు
రామలింగారెడ్డి రా ట్ఫాలభాగాన
మండనంబగు పుట్టుమచ్చయందు

కడకు కత్తుల బావిలో గలసిపోయి
చితులలో రేగు మన రెడ్డి కుతల పతుల
రాచఠీవి, వదాన్యతా ప్రభలమహిమ
ప్రతిఫలించె దిగ్దేశముల్ పండిపోవ.

నాయకురాలి మేటి కదనంబున బాలుని నెమ్మనంబులోఁ
బాయలుగట్టి పొంగిన ప్రభావ పరాక్రమ వీరగాథ దీ
ర్ఘాయువుఁ బొంది శాశ్వత విహారమొనర్చుచు నాగులేరు సౌ
ఖ్యాయతి రూపమెత్తినది యన్నదిఁజూడుము గన్నులారగన్.

అచట కనతి దూరంబున నద్రిచయము
గానగావచ్చునమ్మ నాగార్జున డను
పండితోత్తముఁ డందు స్థాపనముఁజేసె
బౌద్ధ మతమును శిల్పంబుఁ బ్రబలఁజేసి.

పదివేలుంబయి శిష్యబృందములకున్ బద్మాట్లువందల్ విశా
రదులౌ పండిత సద్గురూత్తములు మీఱన్ బౌద్ధ ధర్మాలతో
నుదయోదంచిత శిల్పిశాస్త్రమును, నాయుర్వేద విద్యాప్రభన్
జదువన్ నేర్పిన పుణ్యభూములవి హర్షప్రాప్తి వీక్షిఁపుమా.

భారత దేశమందుఁగల బాలకులే మఱి గాక యెందరో
కూరిమితో విదేశముల కుఱ్ఱలు నచ్చట కేగుదెంచి వి
ద్యారసపూరిత ప్రతిభనంది ప్రశస్తపు భోగ సాధ సం
చార మొనర్చినారలు యశస్సు తెలుంగుల వాట కిచ్చుచున్.

అనుడు జనకుని సలహాల విని మఱింతఁ
బొగిలి, మనజాతి మఱియెట్లు దుగద ముడిగి
వన్నె వాసిని గడియించి పదుగురివలె
బ్రతుకుదురటంచు ప్రశ్నింపఁ బలికె తండ్రి.

గాంధివలెఁ బోరులాడెడు ఘను లనేకు
లుద్భవించి దేశముల మహోగ్రులగుచుఁ
బోరి స్వాతంత్ర్య భాగ్యంబు ముదముఁగూర్చ
పఱకు మనజాతి యగచాట్లు బాయవమ్మ.

అని పలుకుచున్న తండ్రికిఁ
దెలిగ్రుడ్లుం బడుచునున్నఁ దెఱవయు దుఃఖా
విలమతిఁబ్రైఁబడి యేడ్చుచు
దెలివి తొఱఁగె దండ్రిబోధ తెలివి ఘటించెన్.

సర్వము సంపూర్ణము.

---

మండా అంజనేయులు: వాణీ ప్రెస్ ప్రింటింగ్, నరసరావుపేట.